

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

వెల 4 అణాలు ANDHRA PATRIKA ILLUSTRATED WEEKLY 3-5-1

# ★ అమెరికన్ బాలబాలికలకు భారత ప్రధానామాత్యుని కానుక ★




శాంతి, అశోక అను ఏనుగుగున్నలతో వెళిన మావటీడు బాబాజాన్ వాటిని ఆడిస్తున్నాడు.

ఏనుగుగున్నలను చూడవచ్చిన జనం

# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతిబుధవారము ప్రకటింపబడును.

ఒరులేయవి యొనరించిన నరవర యప్రియము తనమనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్
(మహాభారతము)

**Founder : K NAGESWARA RAO**

సంపుటము **42**
సంచిక **35**

విక్రృతి సంవత్సర వైశాఖ బహుళ పాడ్యమి బుధవారము



దూర ప్రయాణము : సిమెంటుతోను, కంకరరాతితోను చేసిన 14 అడుగుల రూపశిల్పము.

శిల్పి శ్రీ రామకింకర్, కళా భవనం, శాంతినికేతనము.



ఆంధ్రపత్రిక

1950-వ సం॥ మే నెల 3-వ తేది బుధవారము

# హైద్రాబాద్ చర్చలు

రాష్ట్రములో 'కమ్యూనిస్టుముప్పును' తొలగించుటకు ఇటీవల అనేక ప్రణాళికలు ప్రకటితమైనవి. ప్రభుత్వప్రణాళికవివరములు మాత్రము బహిరంగము కాలేదు. ప్రతిగ్రామమునందును పౌరరక్షకదళములను ఏర్పరచుచున్నారు. వారికి ఆయుధముల నివ్వ సంకల్పించిరి. ఇటీవల కృష్ణాజిల్లాయందు నాలుగు గ్రామములందు ప్రజలు అప్రమత్తులుగ నుండి దుండగీడుల దాడులను ప్రతిఘటింపకలిగిరి. తమ గ్రామములను రక్షించుకొనకల్గిరి. ఇది శ్లాఘింపతగ్గదె. కాని ప్రమాదమును ఎదుర్కొనుటలో నున్న ఐక్యత, ఐక్యసంఘటన, ప్రమాదము తొలగినతరువాత లేకున్న, ఈ సాయుధ పౌరదళాలపై సరియైన ఆధిపత్యము లేకున్న, నేడు తొలగినప్రమాదము రేపు మరొక రూపమున ప్రత్యక్షము కావచ్చును. లేక ప్రభుత్వ మొసగు ఆయుధములె నేడు విధ్వంసకచర్యలను సాగించుచున్నవారి వశము కావచ్చును. ప్రభుత్వము, ప్రజలుకూడ ఈ రెంటి విషయమై ప్రత్యేకశ్రద్ధ వహింపవలసియున్నది.

ఈ రాజధానియందు అరాచకచర్యలు గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరి జిల్లాలందు అధికముగ నున్నవి. ఇందుకు హైద్రాబాద్ సంస్థాన ప్రాంతము ఈ జిల్లాలకు సంశ్లిష్టముగ నుండుటే కారణమని అధికారుల అభిప్రాయము. తెలంగాణా ప్రాంతమున ఇట్టి అరాచకచర్యలే చాలకాలముగ జరుగుచుండుటవలన అధికారుల అభిప్రాయము సరియైనదే యనుభావము ఏర్పడెను. అరాచకచర్యలను కొనసాగించుచున్నవారు ఈ ప్రాంతమ్మునంతను ఏకఖండముగనే పరిగణించుచుండిరి. ఒక ప్రాంతమునందు విధ్వంసకచర్యలు జరిపి రెండవ ప్రాంతమునందు తప్పించుకుతిరుగుచుండిరి. ఈ రెండుప్రాంతముల అధికారులు పరస్పరము సంప్రతించుకొనుచుండినను, చర్యలు తీసుకొనవలసివచ్చునరికి రెండును భిన్నప్రాంతములుగనే ఉంటున్నవి.

ఈ ప్రాంతమునందు అరాచకచర్యలను అణచివేసి శాంతిభద్రతలను నెలకొల్పుటకు ఈ నాలుగు కోస్తాజిల్లాలను, తెలంగాణా ప్రాంతమును ఒక ప్రత్యేక రాష్ట్రముగ పరిగణించి ఆప్రకారము పోలీసుశాఖను, సిబ్బందిని ఏర్పాటుచేయవలెనని అనేకపర్యాయములు సూచించియుంటిమి. అట్టి ఏర్పాటు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు దోహదముచేయునను సందేహముతో కేంద్రఅధికారవర్గము ఇందుకు సమ్మతింపనట్లు ఊహింపవలసియున్నది.

హైద్రాబాద్‌లో సంస్థానశాఖాకార్యదర్శి వి. పి. మీనన్‌గారి ఆధ్వర్యమున చెన్నరాష్ట్ర, హైద్రాబాద్ సంస్థాన ఉన్నతాధికారులు జరుపిన సంప్రతింపులు సఫలము కావలెనన్న, ఆ సమావేశ నిర్ణయములను అమలుజరుపుటకు పరిస్థితులు అనుకూలము గావలెనన్న, తెలంగాణాను శాంతిభద్రతలకు సంబంధించినంతవరకైన చెన్నరాష్ట్రమునందలి గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరిజిల్లాలతో కలిపివేయుట అవసరము. అధికారులు ఈ విషయమును గ్రహించినగాని, ఈ దృష్టితో సమస్యలను పరిశీలించినగాని సరియైన నిర్ణయములకు రాజాలరు.

హైద్రాబాదునందు జరుగుచున్న అరాచకచర్యలన్నిటికి కమ్యూనిస్టులే బాధ్యులు గారని సర్దార్ పటేల్, పండిట్ నెహ్రూ స్పష్టముచేసిరి. ఈ విధ్వంసకచర్యలకు రాజకీయప్రాధాన్యము అంతగ లేదని వారు తెలిపిరి. ప్రజలును ఈ విషయమును గ్రహించిన, దుండగీండ్లను ఇప్పటికంటె ఎక్కువ ధైర్యముతో ఎదుర్కొనగలరు. కమ్యూనిస్టులకు కొన్ని సంఘటనలతో ప్రత్యక్షప్రమేయము ఉండవచ్చును. ప్రజలను

భయభ్రాంతులను చేయుటకు తామే ఈ చర్యలన్నిటిని జరుపుచున్నట్లు ప్రచారము చేయవచ్చును. ప్రభుత్వము కూడ 'కమ్యూనిజం'పై ప్రజలకు ద్వేషము కల్గించుటకు ఈ దుశ్చర్య లన్నింటికీ కమ్యూనిస్టులే కారకులనుచున్నారు.

అరాజకమును ప్రోత్సహించుటే కమ్యూనిస్టుల ప్రస్తుతకార్యక్రమము. అందుకు వారు నేటి ఆర్థిక సాంఘికపరిస్థితులకు అసంతృప్తిచెందినవారి నందరిని సంఘటితపరచి తిరుగుబాటుకు తయారు చేయుచున్నారు. వీరికి కమ్యూనిజమునందు గాని, కమ్యూనిస్టులందుగాని నమ్మకము లేదు. కాని వారి సమస్యల పరిష్కారమునకు ప్రభుత్వము పూనుకొనకపోవుట వలన దారిదోపెడి మొదలైన అకృత్యములకు పూనుకొనిరి. సమస్యపూర్వాపరాలను గ్రహించిన గాని దేశమునందు నేడు ప్రబలిన అరాచకచర్యలను అణచివేయుట సాధ్యముగాదు. ఈ దుశ్చర్యలకు రాజకీయ ప్రాధాన్య మున్న, అధికారుల దృక్పథమే మారవలసి యుండును. లేకున్న రాష్ట్రపరివ్యాప్తమై యున్న దోపిడిదారుల నిర్మూలనమునకు యావచ్ఛక్తిని వినియోగించవలెను.

---

## భారత-పాకిస్తాన్ సంబంధాలు

---

అమెరికా కెనడాలవలె భారతపాకిస్తాన్ దేశములు ఆర్థికరక్షణవ్యవహారములలో ఒకే విధానమును అనుసరించుట యవసరమని ఉభయ దేశముల ప్రధానమంత్రులు గుర్తించుట శుభసూచకము. ప్రపంచమునందు వివిధ ప్రాంతములలో స్వతంత్రరాజ్యములు ఆర్థిక, వ్యాపార, రక్షణవ్యవహారములకు సంబంధించి ప్రాంతీయసమాఖ్యలుగ ఏర్పడి వ్యవహరించుచున్నవి. అట్టి ఏర్పాట్లు ప్రయోజనకరమని దాదాపు అన్ని దేశములును గ్రహించెను. తూర్పుయూరపురాజ్యములుకూడ ప్రత్యేక ఆర్థిక సమాఖ్యను ఏర్పరచుకొనుట అవసరమయ్యెను. మతమునుబట్టి అరబ్ రాజ్యములసమాఖ్య ఏర్పడినట్లు గాక ఆర్థికరక్షణఅవసరములనుబట్టి ఆయా ప్రాంతముల స్వతంత్రదేశములు ప్రత్యేకసమాఖ్యలుగ ఏర్పడిన, అట్టి సమాఖ్యలు ఐక్యరాజ్యసమితిప్రణాళికకు లోబడి వ్యవహరించిన ప్రపంచసుస్థిరశాంతి సాధన సులభము కాగలదు.

ప్రాంతీయసమాఖ్యలు సమితికి లోబడి వ్యవహరించినంతవరకు ఎవరికి ఎట్టి ప్రమాదము ఉండదు. భారత, పాకిస్తాన్ ప్రభుత్వములు అదేవిధముగ ఆర్థిక, వ్యాపార, రక్షణవిషయములలో 'బెనిలక్స్' దేశములవలె వ్యవహారము చేసుకొనవచ్చును. బర్మా సింహళములను కూడ చేర్చుకొనిన ఈ సమాఖ్య ఆగ్నేయాసియాయందలి అన్ని దేశములను సంఘటితపరచి ఈ ప్రాంతమును ఎదుర్కొనుచున్న సమస్యలన్నింటిని సులభముగ పరిష్కరించుకొన వీలగును. భారత - పాకిస్తానులసఖ్యత ఏర్పడనిది ఇది సాధ్యము గాదు.

ఆగ్నేయాసియాసమాఖ్యస్థాపనకు గాని, పసిఫిక్ ఒడంబడికఏర్పాటుకుగాని భారత - పాకిస్తాన్ దేశములు కలసిమెలసి వ్యవహారము చేసుకొనుట అత్యవసరము. ఇందుకు ఢిల్లీఒడంబడిక ప్రాతిపదిక కాగలదని ఆశింపవచ్చును. కరాచీలో పాకిస్తాన్ ప్రధానమంత్రితో రెండు రోజులు చర్చజరిపిన అనంతరము పండిట్ నెహ్రూ లోగడ ఏర్పడిన చిక్కులు క్రమముగ తొలగిపోగలవని ప్రకటించిరి. అల్పసంఖ్యాకుల రక్షణవిషయమునందే గాక, కాందిశీకుల ఆస్తి, నదీజలముల పంపకమువిషయమునను సమాధానము కుదురుట అసాధ్యము గాదు. అందుకు అనుకూలమైన పరిస్థితులు ఏర్పడినవి.

ఉభయదేశములకు వివాదగ్రస్తవిషయము కాశ్మీరు. ఆ సమస్యకూడ ఉభయపక్షప్రముఖుల

సంప్రతింపులతో పరిష్కారముకాగల యవకాశము లేక పోలేదని పాకిస్తాన్‌విదేశాంగమంత్రి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ ప్రకటించియుండెను. కరాచీసమావేశమునందు కాశ్మీర్ సమస్య చర్చకు వచ్చినట్లు పండిట్ నెహ్రూ వెల్లడించెను. కాశ్మీరు విభజనతప్ప పాకిస్తాన్‌కు మరొకపరిష్కారపద్ధతి అంగీకారము కాకపోవచ్చును. లేక కొందరు విదేశీ రాజకీయజ్ఞులు కాశ్మీరును స్వతంత్రరాజ్యముగ పరిగణించి, భారత పాకిస్తాన్ ప్రభుత్వములు ఉమ్మడిగ సంస్థానస్వాతంత్ర్యరక్షణకు హామీ ఇవ్వవలెనని చేసిన సూచనకు పాకిస్తాన్ సమ్మతింపవచ్చును. ఏదైనప్పటికిని కాశ్మీరువ్యవహారముపై భారత, పాకిస్తాన్, కాశ్మీరుప్రభుత్వములు సమష్టిగ చర్చలు జరిపిన అన్నిపక్షములకు అంగీకారయోగ్యమైనట్టి సమాధానము కుదురుట దుర్లభము గాదు. కాశ్మీరు ముఖ్యమంత్రి షేక్ అబ్దుల్లా తమ సంస్థానసమస్య పరిష్కారము కాగలదను ఆశాభావమును వెల్లడించిరి. పాకిస్తాన్ ప్రధానమంత్రి అమెరికా పర్యటన ముగించుకొని తిరిగి వచ్చినతరువాత ఢిల్లీలో జరుగు సమావేశమునందు ఈ సమస్య ఎక్కువ ప్రాధాన్యము వహించగలదు. ఢిల్లీఒడంబడికను మార్చుకొను సందర్భమున ప్రదర్శించిన సహృదయతనే నెహ్రూ లియాఖత్ ఆలీఖాన్‌గార్లు ప్రదర్శించిన భారత పాకిస్తాన్ స్నేహము దృఢతరమై స్థిరపడిపోగలదు.

---

# విషయానుక్రమణిక
## 3 మే 1950

# మనదేశం



దేశాన్ని ఉద్ధరించాలని ఏవేవో పెద్ద కార్యక్రమాల్ని కాంగ్రెస్ ప్రభుత్వాలు తలపెట్టడం ఒక్కటీ కొనసాగకపోవడం చూస్తే ప్రజల్లో ఇంక ఈ కాంగ్రెస్ ఏం చెయ్యగలదనే సందేహం నానాటికి ప్రబలమౌతోంది. ఎంత ఆచరణయోగ్యాలైన కార్యక్రమాలనైనా సక్రమంగా నిర్వహించలేకపోవడానికి కారణాలు వెతకనక్కరలేదు. అప్పుడప్పుడు ఈ కారణాలు మరీ విపులంగా కనిపిస్తాయి.

ఈవారం కొన్నికొన్ని పత్రికాప్రకటనలు చూస్తే కాంగ్రెస్‌నాయకుల్లో ఏ విషయంపైనా స్థిరాభిప్రాయం లేదనీ, ఏకాభిప్రాయం అంతకంటె మృగ్యమనీ బోధపడుతుంది. ఆయాసమస్యల్ని దేశపరిస్థితుల దృష్ట్యా పరిశీలించి, ఆ పరిస్థితులకు అనుగుణంగా ఏ కార్యక్రమాలు, ఏ పరిష్కారవిధానాలు ఆచరణసాధ్యాలో రీతిబద్ధంగా చర్చించి నిర్ణయించాలనే భావం కనపడదు.

ఉదాహరణకి జాతీయఆర్థికపునర్నిర్మాణం, వ్యాపారనిర్బంధాలు (కంట్రోల్స్), కమ్యూనిస్టుసమస్య కనిపిస్తాయి.

ఈ సమస్యల్నిగురించి వివిధనాయకులు వివిధరీతుల భావాలు ప్రకటించారు. అయితే తత్వపరీక్ష చెయ్యాలనే యత్నం ఎక్కడా కనిపించదు. జాతీయార్థికపునర్నిర్మాణ సమస్య చర్చించడంనిమిత్తం [illegible] రాష్ట్రాల ముఖ్యమంత్రులు కాంగ్రెస్ అధ్యక్షకార్యదర్శులు సమావేశమైనప్పుడు దీర్ఘమైన ఒక తీర్మానం ఆమోదించబడింది. ఈతీర్మానంలో మూడు ముఖ్యఆదర్శాలు ప్రకటించబడినాయి. 1. వ్యవసాయం, భారీపరిశ్రమలు, చిన్నయంత్రపరిశ్రమలు, కుటీరపరిశ్రమలు, సేవావృత్తుల నన్నిటినీ సమీకరించిన ఆర్థికవ్యవస్థను నిర్మించడం. 2. వ్యవసాయంలోనూ పరిశ్రమలలోనూ ఉత్పత్తిని అవసరాల కనుగుణంగా పరిమితంచేసి, సహకారవిధానంపైన ఆధారపడిన వికేంద్రీకరణ సాధించడం. 3. దేశీయార్థికాభివృద్ధిని నిర్ణీతపథంలో పెట్టి, సంపదుత్పత్తికి తోడ్పడేవారందరికీ న్యాయోచితమైన ప్రతిఫలం లభింపచేసి ప్రజల జీవనసౌకర్యాల్ని వృద్ధిపరచడం.

ఈ ఉన్నతాశయాల్ని సాధించడానికి కాంగ్రెస్ ప్లానింగ్ సబ్‌కమిటీ ఒకవంక, భారతప్రభుత్వపు ప్లానింగ్ కమిషన్ ఒకవంక కార్యక్రమాల్ని వివరంగా సిద్ధపరుస్తాయి. ఈ ఉభయసంస్థలమధ్యనూ త్వరలోనే అభిప్రాయభేదాలు ఏర్పడగలవని కాంగ్రెస్ అధ్యక్షులు డా॥ పట్టాభిగారు ముందే జోస్యం చెప్పారు. వారు చెప్పిన జోస్యం అనుభవఫలితం. అటువంటి సంఘర్షణ రాకుండా ఇటువంటి సమావేశాలు అవసరమని వారన్నారు. కాని సమావేశమైనంతమాత్రాన సంఘర్షణ పోతుందా అనేదే సందేహం. ఆశయతీర్మానాన్ని ఏకగ్రీవంగా రాష్ట్రముఖ్యమంత్రులు, రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షకార్యదర్శులూ ఆమోదించారు. బహిరంగసభల్లో ఉపన్యాసాల్లోనూ, పత్రికాప్రకటల్లోనూ కానవచ్చే అభిప్రాయభేదాలు ఈ సమావేశంలో ఎందుకు ఉత్పన్నం కాలేదు?

ఉత్పన్నం కాకపోవడానికి రెండే కారణాలు సంభవం. ఒకటి ఆశయాలు అత్యున్నతమైనవీ, అస్పష్టమైనవీ కావడంవల్ల భేదాభిప్రాయాలకే కాక విరుద్ధాభిప్రాయాలకి కూడా బోలెడంత ఎడం ఇచ్చివుండవచ్చును. సందిగ్ధనిర్ణయాలపైన చర్చ అనవసరం. అటువంటి నిర్ణయాల్ని ఎవరిమటుకువారు చిత్తం వచ్చిన అర్థాలు తీసి అనుకూలంగా వినియోగించుకోవచ్చును. రెండో కారణం: ఈ ఆశయ తీర్మానం ఎలావుంటేనేం? ప్లానింగ్ కమిషన్ తన పని తాను చూసుకోగలదు అనే భావం. ఇదీ సంభవమే. కాంగ్రెస్ సంఘాలకీ ప్రభుత్వాలకీ మధ్య నిర్మాణకార్యక్రమాల విషయమై ఎన్నడూ ఏకాభిప్రాయం కుదరలేదు. కాబట్టి కాంగ్రెస్‌వారు ప్రచారం చేసుకుంటూ పోవచ్చు. ప్రభుత్వాలు ప్లానింగ్ కమిషన్ చాటున తమకు వీలైన కార్యక్రమాల్ని, (పార్లమెంట్‌లో పరపతినికూడా ఒకవంక కనిపెట్టి) సాధ్యమైనంతవరకే అమలు జరపవచ్చును.

ఈ భావనాగతి ప్రభుత్వాలలో సుస్పష్టంగా ఉంది. చెన్నరాష్ట్రంలో సహకారోద్యమాల్ని వృద్ధిపరచాలని అందరూ ఉపన్యసించేవారే కనపడుతున్నారుకాని, అటు కాంగ్రెస్ సంఘాలుకాని ఇటు ప్రభుత్వాలుకాని హృదయపూర్వకంగా కృషిచేసిన దెప్పుడూ లేదు. పోగా ఉపన్యాసాల్లో ఏఒక్క వివరంపైనా ఏయిద్దరికీ ఏకాభిప్రాయం ఉన్నట్లు కనపడదు. తనఖాబాంకులికి ఋణాలివ్వగల మొత్తాల్ని పెంచితే చాలు సహకారోద్యమాన్ని విస్తరింపచేస్తున్నామని చెన్నరాష్ట్రప్రభుత్వం భావిస్తోంది. కాంగ్రెస్‌సంఘాల కసలీ విషయమై చింతే లేదు. లేకపోతే సహకారవిధానానికి అపూర్వావకాశమిచ్చిన చరఖాసంఘాల్ని బూజుపట్టించి ఉండరు.

వ్యాపారనిర్బంధాల అవసరాన్ని మరోసారి సమగ్రంగా పరిశీలించి, అనవసరమని తోచిన వస్తువులపైన ఈ నిర్బంధాల్ని తొలగించాలని సూచిస్తూ ఢిల్లీసమావేశం మరొక తీర్మానం చేసింది. వ్యాపార నిర్బంధాలు తొలగించాలనే అభిప్రాయం రాష్ట్రాల ముఖ్యమంత్రులు కూడా బలపరిచారట. కొన్ని రాష్ట్రాలవారు కంట్రోల్స్ తొలగించాలని కోరుతున్నారనీ, కొన్ని రాష్ట్రాలవారు తొలగించకూడ దంటున్నారనీ ఇదివరలో ఒకపర్యాయం భారతప్రభుత్వప్రతినిధి ఒకరు ప్రకటించారు. అందువల్ల ఒకనిర్ణయం జరగడం లేదు.

రెండేళ్ళక్రిందట ఆహారంపైనా, వస్త్రంపైనా వ్యాపారనిర్బంధాలు తొలగించారు. వెంటనే పరిస్థితి విషమించడంతో తిరిగి విధించవలసివచ్చింది. ఆ సందర్భంలో కూడా

వివిధరాష్ట్రాలు వివిధాభిప్రాయాల్ని ప్రకటించాయి. ఈ అభిప్రాయభేదాల్లో వాస్తవంగా తత్వభేదమే ఉంటే ఢిల్లీసమావేశంలో చర్చించి ఎలా నిర్ణయానికి వచ్చారో తెలియదు. ధాన్యంరోపైన కంట్రోల్ తొలగించాలని ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం కోరితే, చెన్నరాష్ట్రం ప్రతిఘటిస్తుంది. వేరుసెనగపైన కంట్రోల్ తొలగించాలని చెన్నరాష్ట్రం కోరితే మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఒప్పుకోదు. వీనినిబట్టే ఒక విషయం బోధపడుతుంది. ఈ రాష్ట్రప్రభుత్వాల వ్యాపారపరిపాలనావిధానంపైన కేంద్రప్రభుత్వఅజమాయిషీ ఇప్పటికంటె శ్రద్ధతో జరగాలి. సమస్యల్ని సమగ్రంగా చర్చించాలి.

పరిశ్రమాభివృద్ధినిగురించి పార్లమెంట్‌లో చర్చలు ఎప్పుడు వచ్చినా, ప్రధానపరిశ్రమల్ని ప్రభుత్వం వశపరుచుకోవాలని పండిట్ భార్గవాప్రభృతులు వాదించేవారు. పార్లమెంటుసభ్యులికి పరిశ్రమలంటేనూ వ్యాపారమంటేనూ బొత్తిగా విషయపరిజ్ఞానం కొరవగా ఉందని తలిచి వారిని ఉద్ధరించడానికిగాను పారిశ్రామికయజమానులు తమ స్వంత ఖర్చులపైన పెద్దపరిశ్రమల కేంద్రాలన్నిటినీ 39 మందికి చూపుతున్నారు. పల్లెనచోట్ల విందులు పరస్పర ప్రశంసలతో ఉభయపక్షాలమధ్యనూ సమరసభావం అధికమౌతోంది. చూసినంతరకే కొంతమంది పార్లమెంటుసభ్యుల మనస్సులు మారిపోయాయి. పరిశ్రమల్ని ప్రభుత్వం వశం చేసుకుంటే అభివృద్ధి లేకపోగా ఉన్నవి కూడా అధోగతిపాలౌతాయనే అభిప్రాయం భార్గవాప్రభృతులకు కలిగింది. ఇంత సులువుగా మనస్సులు మారితే తత్వచర్చ, సమగ్రసమీక్ష కుంటువడక తప్పదు. త్వరలోనే ఈసభ్యులు వ్యాపారనిర్బంధాల్నిగురించి కూడా మనసు మార్చుకున్నా ఆశ్చర్యపడనక్కరలేదు.

మచ్చుకి ఆహారం విషయంలో కంట్రోల్ సంగతి చూద్దాం. ఆహారాన్ని ఎక్కువగా పండించాలి. ఇందుకు ప్రభుత్వం అపారంగా ద్రవ్యం ధారపోస్తోంది పండిన ధాన్యాన్ని ప్రభుత్వం విధించే షరతులప్రకారం, వారి అనుమతితో, వారు చెప్పే వారికి వారు నిర్ణయించిన ధరలకి మించకుండా అమ్మాలి. సేకరించిన ధాన్యాన్ని ప్రభుత్వం ఏయే ప్రాంతాలకు ఎంతెంత సరమో లెక్కలుకట్టి పంపాలి. దీనివల్ల చిల్లరఅమ్మకపుధరని ప్రభుత్వం నిర్ణయించి ఆ ప్రకారం అమ్మించగలుగుతోంది.

కాని పండించేవాడికి తాము నిర్ణయించిన ధరకి అమ్మడానికి వీలౌతున్నదా అని చెన్నరాష్ట్రప్రభుత్వం శ్రద్ధవహించలేదు. అది తమ పని గాదనికూడా ఒకసందర్భంలో స్పష్టపరిచారు. పోనీ వ్యవసాయపుఖర్చుల్ని అదుపులో పెట్టారా అంటే అదీ లేదు. కాని మిల్లర్లుమాత్రం సంఘాలుగా కూడి ధరల్ని దిగదీస్తే చూస్తూ ఊరుకుంటారు. ప్రభుత్వసేకరణాధికారులికే అమ్మదామంటే మిల్లర్లిచ్చే పాటబజానాయేనా చేతికిరాక రైతు శిస్తులు చెల్లించడానికి డబ్బుండదు. శిస్తుచెల్లింపు సమయం చూసి మిల్లర్లు సేకరణోద్యోగులూ ఏకమై దాగుడుమూతలాడి రైతుదగ్గర ధాన్యాన్ని చవగ్గా పిండేస్తున్నారు. అందువల్లనే ఈ రోజుల్లో వ్యవసాయం చెయ్యడంఅంటే తద్దినం కొని తెచ్చుకున్నట్టేననే భావం స్థిరపడిపోయింది. ఇంక బాగుపడుతున్నవాళ్లెవరంటే ఖద్దరుకట్టి ఛోటా కాంగ్రెస్ నాయకుల్తో నేస్తాలుకట్టే రైతులు. ఒకవంక ఉద్యోగులతో దోస్తీచేసి దాగుడుమూతలాడుతూనే దోస్తీవల్ల తమ బేరాలు "తక్టే" లాభసాటిగా లేవని మిల్లర్లు మొరపెడతారు. అందువల్ల కొన్నధరకీ అమ్మేధరకీ మధ్య లాభం మరికొంచెం ఎడంకావాలని ప్రతియేడూ మిల్లర్లు మంత్రులవద్దకు సెంట్‌జార్జి కోటకి రాయబారాలు వెళ్లడం పరిపాటయింది. ఛోటానాయకులు మంత్రుల్తో ఏకమై లంచగొండితనాన్నీ బ్లాక్‌మార్కెట్‌నీ దుమ్మెత్తిపోసి ఉపన్యాసాలివ్వడం పరిపాటయింది. అది అంతతో ఆఖరు. మిల్లర్లు వాళ్ల పనివాళ్లు చాటుగా చేసుకోడానికి అంతరాయం ఉండదు.

పరిపాలనావిధానంలోని లోపాల్ని విమర్శించి తదనుగుణంగా శాసనాల్ని సవరించవలసిన శాసనసభ్యులు పరిపాలనలో "తోడ్పడ్డానికి" ముందుకు రావడంవల్ల ఆశ్రితజనపక్షపాతానికీ ముఠాతత్వానికీ తావివ్వడమేకాకుండా పరిపాలనలో అన్యాయాలు జరుగుతున్నాయి. పద్ధతి మారితేగాని మంత్రులెంత చిత్తశుద్ధిగలవారైనా అన్యాయాన్ని నివారించలేరు. ఇది చాలదు. ఆహారం విషయమై కంట్రోల్ అమలుజరిపేటప్పుడు రైతులస్థితిగతుల్ని బట్టి ధరలు నిర్ణయించి, ఆధరలు వారికి లభించే, ఏర్పాటు చెయ్యాలి. ఇటువంటి ఏర్పాటుకి సహకారసంఘాలు ఎంతైనా తోడ్పడవచ్చును.

మిల్లర్లసంఘాల్ని ప్రోత్సహించే ప్రభుత్వం ధాన్యం అమ్మకానికి రైతు సౌకర్యానికి సహకారసంఘాల్నెందుకు ప్రోత్సాహపరచడంలేదో తెలియదు. ఇటువంటి లోపాలవల్లనే మన దేశంలో ప్లానింగ్ అర్థమనస్కతతో జరుగుతున్నదని చెప్పవలసి వస్తోంది.

ఇటీవల పార్లమెంట్ సభ్యుడు • జస్పత్ రాయ్‌కపూర్ గారు" వ్యాపారనిర్బంధాల్ని గురించి పార్లమెంట్ సభ్యుల అభిప్రాయాల్ని సేకరించారు. సమాధానా లిచ్చిన వారిలో అధికసంఖ్యాకులు కంట్రోల్స్ రద్దుపరచాలనే అభిప్రాయం తెలిపారట, సమాధానా లిచ్చినవారిలో కంట్రోల్స్ రద్దు కావాలనె వారి తరఫున స్పీకర్ మాలంకర్ గారు తమ అభిప్రాయాన్ని వివరించారు. రద్దు కాకూడదని మంత్రి గాడ్గిల్ గారు వాదించారు. వస్తూత్పత్తి ధనికవర్గంచేతుల్లో ఉన్నంతకాలం, ప్రజల అవసరాలకు తగినట్లు వస్తువులు లభ్యంకావడం అసంభవమని గాడ్గిల్ గారి అభిప్రాయం. వ్యవసాయం పరిశ్రమల అభివృద్ధిని దేశావసరాలప్రకారం ఆయాప్రాంతాల సౌకర్యాలను కనిపెట్టి నిర్ణయిస్తేగాని ఆర్థికకల్లోలం తప్పదని వారి ఉద్దేశం. కాని కంట్రోల్స్‌పద్ధతివల్ల ప్రజల్లో అవినీతి అన్యాయం పెరిగిపోతున్నాయని మాలంకర్ గారు అభిప్రాయపడ్డారు. ఇప్పుడు దేశంలో అమలుజరుగుతున్నంతమటుకు చూస్తే, ఏఅవసరాలకోసం కంట్రోల్స్ అమలుజరిపారో, ఇప్పుడా అవసరాలు తీరడంలేదు కాబట్టి కంట్రోల్స్ రద్దు కావాలని మాలంకర్ గారన్నారు. అసలు వస్తూత్పత్తి ప్రజల అవసరాలనుబట్టి గిరాకీనిబట్టి జరుగుతూఉండడం సహజమని వారి అభిప్రాయం. కాబట్టి ఇటువంటి సహజవ్యాపారధర్మాన్ని అరికట్టినందువల్ల ప్రజల అవసరాలు తీరడంలేదని వారన్నారు.

వీటి నన్నిటినీ పరిశీలించిన కపూర్ గారు కంట్రోల్స్ ఉండాలన్నారు. విదేశీ వస్తువుల్తో పోటీచెయ్యలేక రక్షించమంటూ విదేశీవస్తువులమీద రక్షణసుంకాలి విధింపచేసిన దేశీయపరిశ్రమలు కంట్రోల్స్ తీసెయ్యాలనడంలో అర్థంలేదని వారన్నారు. ఒక చెంప కంట్రోల్స్ రద్దుపరచాలంటూ మరొకచెంప ఎగుమతి దిగుమతివర్తకాల్లో ద్రవ్యమారకాన్ని కంట్రోల్ చెయ్యడంలో అర్థం లేదన్నారు. కాబట్టి కంట్రోల్స్ తొలగించాలంటే విదేశీవస్తువుల్ని రక్షణసుంకం విధించకుండా స్వేచ్ఛగా దిగుమతిచేసుకోనివ్వాలని వారి అభిప్రాయం.

కపూర్ గారి వాదాన్ని తోసిపుచ్చడం కష్టం. వారి వాదాన్ని సమర్థించడానికి మన పంచదారపరిశ్రమే చక్కని తార్కాణం. దిగుమతిచేసుకుంటే క్యూబానించి పంచదార చవగ్గా వస్తుంది. కాని అలా దిగుమతి చెయ్యనిస్తే మన పరిశ్రమలు పోటీచెయ్యలేవని పంచదార పరిశ్రమ వారన్నారు. స్వదేశీపరిశ్రమాభిమానంతో వారిని దయతలిచి మనటారిఫ్‌బోర్డు వారు దిగుమతి చేసే పంచదారపైన అధికంగా సుంకాలు విధించారు. ఈ సుంకాలపట్ల విదేశీపంచదారధర పెరిగింది. మన పంచదార పరిశ్రమవారు పోటీకి నిలిచారు. కాని ఈరక్షణని ఆధారం చేసుకుని, దిగుమతులు తక్కువై దేశంలో ఏర్పడిన కొరత అదునుతీసుకుని ధరలు చిత్తంవచ్చినట్లు (ప్రభుత్వానికి ముందిచ్చిన వాగ్దానాన్ని భంగపరిచి) ధరలు పెంచేశారు. బ్లాక్ మార్కెటింగ్‌కి వీలుగా కుంభకోణం చేశారు. ప్రభుత్వం కళ్ళు తెరిచి తిరిగి ధరల కంట్రోల్ ప్రవేశపెట్టింది. కాని ఆట్టే ప్రయోజనం కలగలేదు.

అందువల్ల వ్యాపారం "సహజధర్మాన్ని" నమ్మి కంట్రోల్స్ తొలగిస్తే దేశం వ్యాపారుల చేతుల్లో నలిగి నెత్తురోడవలసి వస్తుంది. కంట్రోల్స్, సరిగ్గా అమలుజరగనిమాటా నిజమే. లంచగొండితనం, ఆశ్రితజనపక్షపాతం, బ్లాక్‌మార్కెటింగ్ మొదలైనవి పెరిగిపోయినమాటా నిజమే. కాని తమ భారం వొదుల్చుకోవాలని రాష్ట్రముఖ్యమంత్రులు కంట్రోల్స్ తొలగించాలని చెప్తే, ఇది అన్ని అంశాలు చర్చించి చేసిన పరిశీలనకు ఫలితం కాదు. అవసరమా అనవసరమా అనే విషయాన్ని ఏ ఆధారాలపైన పరిశీలన జరుపుతారు? ఏ అంశాలపైన నిర్ణయిస్తారు? దేశంలో ఏది ఎంత పండుతుందో, ఏది ఎంత తయారవుతోందో ఈనాటికీ ప్రభుత్వానికి లెక్కలు తెలియవు. ఇంక పరిస్థితిని తెలుసుకోడానికి ఉన్నవరకే ఆధారాల్ని నమ్మాలి. కేవలం ఊహపైన ఆధారపడితే ప్రయోజనం ఉండదు. కంట్రోల్స్ ఉన్నప్పుడు వస్తువు బ్లాక్‌మార్కెట్‌లో ఎంత ఏ ధరకి దొరుకుతున్నదీ గమనించవచ్చును. ఈ ఆధారాన్ని బట్టిచూస్తే ఇంతవరకూ వస్త్రం మినహా మరే వస్తువుకూ కరువు తీరేటట్లు కనిపించదు. పాకిస్తాన్‌నుంచి పత్తి దిగుమతి నిలిచిపోయినందువల్ల ఇప్పుడు వస్త్రానికీ తిరిగి ఇబ్బంది వచ్చే సూచన ఉంది. కాబట్టి కంట్రోల్స్‌ను అమలుజరిపే విధానాన్ని సంస్కరించడానికి ప్రయత్నించగలసిన అవసరం కనిపిస్తుంది కాని తొలగించవలసిన అవసరం కానరాదు. కంట్రోల్స్ ఉన్నప్పటికీ వ్యాపారానికి అభివృద్ధిఅవకాశాలు అపారంగా ఉన్నాయి. వారు ఉన్నతఅవకాశాల్ని వినియోగించుకోలేకపోయారు. అందువల్ల వ్యాపారనిర్బంధాలు తొలగించినంతమాత్రంచేత వ్యాపారులికి ఒక్కసారిగా లేని అవకాశాలు లభిస్తాయనీ, వారు వస్తూత్పత్తిని వృద్ధిచేస్తారనీ నమ్మకంలేదు.

[సీతారామ్]

# ఆసియాకల్లోలంలో పాశ్చాత్యదేశాల తంత్రం

ఈజిప్టు ప్రధాని ముస్తాఫా ఎల్ నహస్ పాషా వయస్సు 72 ఏళ్లు. ఈజిప్టు స్వాతంత్ర్యంకోసం దీర్ఘ సంగ్రామం సలిపిన జాతీయనాయకుడు. ఇప్పుడు భారతదేశంలో పండిట్ నెహ్రూపట్ల ప్రజల కెంత ప్రేమాభిమానాలున్నాయో, ఈజిప్టులోనే కాక అరబ్బీదేశాలన్నిటిలోనూ అంతగా ప్రజల ఆదరాభిమానాలను నహస్‌పాషా ఆర్జించాడు. నహస్ పాషా వఫ్ట్ పార్టీకి నాయకుడు. అపార్టీకూడా మన కాంగ్రెస్ మాదిరిగానే మతంతో నిమిత్తంలేని జాతీయ సంస్థ. ఈనాడు ఆసియాలో ముగ్గురు అగ్రనాయకుల్లోనూ నహస్‌పాషా ఒకడు. మిగతావారు పండిట్ నెహ్రూ, చీనా కమ్యూనిస్టు నాయకుడు మావ్ సెటుంగ్ ఆసియాలోని దేశాలన్నిటిలోనూ ప్రజలహృదయాలను పాలిస్తున్నవారీముగ్గురే.

నహస్‌పాషా పండిట్ నెహ్రూలు గాఢమిత్రులు. లండన్ విశ్వవిద్యాలయంలో సహాధ్యాయులు. ఉభయులూ తమ తమ దేశాల జాతీయ రాజకీయాల్ని ఒకేపంథాలో నడుపుతున్నారు. ఉభయులూ అసమానమైన ప్రజావాత్సల్యాన్ని పొందారు. ఇరువురి మైత్రీ ఎప్పటిలాగే ఉన్నప్పటికీ, కాలక్రమేణా వారి దృక్పథాల్లో కొ[illegible] వ్యత్యాసం వచ్చింది.

ఆంగ్లో-అమెరికన్ రాజనీతిజ్ఞుల్ని విశ్వసించి వారితో మైత్రి చేస్తున్నారు పండిట్ నెహ్రూ. నహస్‌పాషా ఆ రాజనీతిజ్ఞుల్ని ఒక కంట కనిపెడుతూ ఉంటాడు. ఇంతే ఆనాయకులమధ్య వచ్చిన వ్యత్యాసం.

నహస్‌పాషా తరుచు పత్రికాప్రతినిధుల్తో గోష్ఠి చెయ్యడు. పాశ్చాత్యపత్రికలవారి దుష్ప్రచారం సంగతి పాషాకు చక్కగా తెలుసును. ఇటీవల భారతదేశంనుంచి వెళ్లిన "బ్లిట్జ్" పత్రికాసంపాదకునికి దర్శనమిచ్చాడు. ఆ సందర్భంలో పండిట్ నెహ్రూతో తన మైత్రిని జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. ఆ సంపాదకునితో ఆసియా వ్యవహారాల్నిగురించి మాట్లాడాడు. ఆంగ్లో-అమెరికన్ తంత్రజ్ఞుల్ని విశ్వసించడం మేలుకాదని పాషా హెచ్చరించాడు.

నెహ్రూతో విశ్వవిద్యాలయంలో రోజుల్ని జ్ఞప్తికి తెచ్చుకుని పాషా ఇలా అన్నాడు.

"స్వతంత్రఆసియా స్థాపనగురించి మేమిద్దరం చాలా స్వప్నాలుకన్నాం. మా ఉభయదేశాల్నీ పాశ్చాత్యసామ్రాజ్యవాదుల గుప్పిటనుంచి వొదిలించడానికి కార్యక్రమాల్ని ఇద్దరం కలిసి నిర్ణయించుకున్నాం. అసియాదేశాల అంతరంగిక దౌర్బల్యమే తరతరాలుగా వానిని బానిసత్వానికి దించిందని ఇద్దరమూ గ్రహించాం. మిత్రుల మధ్య వైరాలు పెంచి మతంపేరిట కలహాలు రెచ్చగొట్టి పాశ్చాత్యులు పాలించగలుగుతున్నారు, ఈ తంత్రానికి ఆసియావాసులు లొంగిపోయారు. అందువల్ల ఐకమత్యం చేకూర్చుకోగలిగినట్లయితే పాశ్చాత్యుల తంత్రం భగ్నమైపోగలదని తెలుసుకున్నాం. ఈ ఐకమత్యం సాధించడంలో జాతిమతాది వివక్షతల్ని అతిక్రమించవలసిఉంది. ఆ ఐకమత్యమే దాస్యశృంఖలాల్ని త్రెంచగలిగేది."

"ఆనాడు కూడా మతభేదాలతో నిమిత్తంలేకుండా ఏకైకరాజకీయసంస్థను స్థాపించి పోరాడాలని సలహా ఇస్తూవచ్చాను. మహమ్మదీయుడు మసీదులో మహమ్మదీయుడుగానే ఉండవచ్చును. హిందువు దేవాలయంలో హిందువుగానే ఉండవచ్చును. కాని దేవమందిరాలు దాటినతరవాత ఉభయులూ భారతీయులుగానే ఉండాలి. పండిట్జీ కూడా దేశాని కదే సలహా ఇచ్చారు. మా దేశంలోనూ అనేక మతాలవారున్నారు."

"ఈ రీతిగా మతరహితరాజకీయఆర్థికాశయజాతీయసంస్థల్ని స్థాపించి, మా ఉభయదేశాల్లోనూ సామ్రాజ్యవాదుల్ని ఎదిర్చి పోరాడాలని మేమిద్దరం నిర్ధారణ చేసుకున్నాం."

"కాని ఈ ఉద్యమంలో ఈజిప్టు జయించగలిగింది. భారతదేశం పరాజయం పొందింది. ఈజిప్టులో 1919 విప్లవంమొదలు అన్నిమతాలవారు ఏకమై బ్రిటిష్‌వారి తుపాకుల్ని ఎదిరించి పోరాడారు. మతాన్నిబట్టి కులాల్నిబట్టి మా దేశాన్నికూడా చీలదియ్యాలని బ్రిటిష్ తంత్రజ్ఞులు పన్నిన పన్నాగం విఫలమయింది."

"భారతదేశంలో వారి తంత్రాలు జయించడం దురదృష్టం. ఎందువల్లనంటే భారతదేశంలోని నాయకులందరూ గాంధీ నెహ్రూలవంటివారు కాలేకపోయినారు. సామ్రాజ్యవాదుల కళ్లు చల్లగా దేశం ముక్కలయింది."

"దేశవిభజనంటే నేనెన్నడూ సమ్మతించలేదు. హిందూముస్లింవివక్షతంటే నేనెన్నడూ సహించలేదు. చిట్టచివరికి భారతదేశనాయకులు దేశవిభజనకి అంగీకరించడంవల్ల, తంత్రజ్ఞులు సాధించిన కార్యానికి తలొగ్గక మిగిలిందేమీ లేదు.

"ఈనాడు తిరిగి భారత పాకిస్తాన్‌ల

(39 వ పేజీ చూడుడు)

నవల:




శ్రీ నోరి నరసింహశాస్త్రి

౨౧

రుద్రమ ఇప్పటికి కొంతకాలముగా మనస్స్వాస్థ్యము లేనిదాని వలెనే కనబడుచున్నది. రుద్రాంబ పిలిపించినంతనే ఆపిలయామెయొద్దకు శీఘ్రముగా బోవును. ఆమె చెప్పిన సర్వకార్యములు సక్రమముగా నిర్వహించును, అడిగిన ప్రశ్నల కన్నిటికి సాదరముతో గౌరవముతో నుత్తరము లిచ్చును. కాని తనస్వయముగానే విషయమునను పూర్వమువలె చొరవ కలిగించుకొని మాటాడదు. అది గమనించిన రుద్రమ, వయస్సులోని మార్పువల్ల నట్లు ప్రవర్తించుచున్నదేమో, యని సరిపెట్టుకొనుచుండెను.

కాని ఆ సరిపెట్టుకొనుట అంతకంతకు సాధ్యపడుట లేదు. రుయ్యమమాటలలో వెనుకటి యుత్సాహమే ఇప్పుడు లేదు. ఒక్కొక్కమారు మాటలమధ్యలో ముఖ మావలకు త్రిప్పుకొనును. ఏల? మరల నిటు తనకు సమ్ముఖముగా త్రిప్పుకొనులోపల నామె చీరచెరగు ముఖమున ప్రసరించియుండును. ముఖమున కలిగిన స్వేదము తుడిచికొనినదా? అంత తాపము లేదే! అటుగాక ముఖమున చెరగిన తిలకము గాని, కన్నుల చెదరిన కాటుక గాని, చెక్కుల రేగిన కురులు గాని సవరించుకొన్నదా? లేదే! మరి యేమి? కన్నీరు కార్చినదా? అప్రయత్నముగా ఆగక వచ్చిన కన్నీరు అద్దుకొని, మరి రాకుండ ముఖము బిగించుకొని, ఇటువైపుకు తిరిగినదా? పాపమీ పిల్లకు దుఃఖకారణ మేమైయుండును?

రుద్రమ పలుమారు సూచనగా నడిగి చూచెను. కాని యా బ్రాహ్మణబాల చిరునవ్వుతో హాస్యవచనములతో తప్పించుకొనుచుండెను. రుద్రమ నిజమే కావచ్చునని యనుకొనును. కాని కాదేమో యని సంశయమును ఆమెకు వదలదు.

రుద్రమకు యౌవరాజ్యాభిషేకమే చేసినను గణపతిదేవులు సర్వరాజ్యభారము నామెపై నుంచుటచే నామెకు మహారాజ్యప్రాప్తియే యైనది. రాజ్యప్రాప్తితోపాటు భర్తృవియోగమును భర్తతో విరోధమునుగూడ నామెకు సంభవించినవి. అది తాను వాంఛింపలేదు. మీదుమిక్కిలి యట్టి యవస్థ రాకుండ నివారించుటకును ఆమె హృదయపూర్వకముగా ప్రయత్నించినది. కాని యా ప్రయత్నము విఫలమైనది. రాజధర్మము పాలించుటకు తా నిప్పుడు భర్తను విడువవలసి వచ్చినది. ఇట్టి దురవస్థపాలయినవారు పూర్వ మెవరైన గలరా?

శ్రీరఘురాముడు ఆత్మాధికప్రియ యగు ధర్మపత్నిని ప్రజాభిప్రాయముకొరకు విడనాడవలసివచ్చెనుగదా! పాప మాతడా బాధ యెట్లు భరింపగలిగెనో! తనభర్త యధర్మ మాచరింపడను నఖండవిశ్వాసము గల సీతామహాదేవి శ్రీరామాజ్ఞనుగూర్చి యేమని తలంచినదో గదా! విధికృతము! విధికృత మిట్లే యేల సంభవింపవలెను?

ప్రజారంజనార్థము శ్రీరామచంద్రుడు నిరపరాధ యగు ధర్మపత్నిని వివాసమున కంపినాడు. కాని నే నిప్పుడు ప్రజాక్షేమము నిమిత్తము అపరాధి యగు వీరభద్రేశ్వరుల శిక్షింపవలసివచ్చినది. భార్యయు భర్తయు వివాహసంస్కారముచే నేకదేహముకలవారగుదు రని కర్మవిదు లందురు గదా! వీరభద్రేశ్వరులను శిక్షించుట యన్న వారియందున్న నా యర్ధభాగమును వారి యర్ధభాగమును శిక్షించుట యగును! శ్రీరాములు చేసినట్లు తమ్ముని బిల్చి రథమెక్కించి విజనారణ్యమున విడిచిరమ్మని పంచుటవంటిది గాదే ఇది! రణరంగమున వారి నెదిర్చియో, దాగుడుకయ్యమున రహస్యమార్గముననో నా యుద్యోగులు గాని నే గాని వారిని భంజించి శిక్షింపవలెనే! అట్టిసమయముల నెవరి ప్రాణము లేమగునో ఎవరు చెప్పగలరు? వారి ప్రాణములకే యాపద వచ్చిన నా మాంగల్యమునకుగూడ నాపద వాటిల్లునే!

ఇట్లు కొంతపడి తలంచును. అంతలో తన స్వయంవరమునందనతో నాతనికి ప్రవృత్తమైన ఖడ్గయుద్ధము స్మృతిలో బారును. అందు తా నెట్లోడెనో ఆమె కిప్పటికిని అవగతము కాదు. అట్లే ధనుర్విద్యాప్రదర్శనమున గూడ నాతనికి త నెట్లు తీసిపోయెనో ఆమె కింతవరకు నర్థము కాలేదు. తాను వీరభద్రేశ్వరులచే విజితురాలయ్యెనని మధ్యవర్తులు ప్రకటించిరి. వారు పక్షపాతము చూపిరా? పెద్దల నంటమాట యను టెట్లు? ఎట్లైన నేమి? తాను వీరభద్రేశ్వరవిజితయే! విజితయే!

స్వయంవరసమయమున నా యుద్ధమున దా నెట్టి యప్రమత్తతయు జూపలేదు. జయింపవలె ననియే తా నాతనితో పోరినది. ఆతని జయింపవలెనను నిచ్ఛ తన కింతమాత్రము నప్పుడు లేదే! అతనియందు తన కట్టి మోహమును గలిగియుండలేదు. పైపెచ్చు ఇతడు నాతో సమానముగా నెదిరించి నిలువగలడా యను సంశయమె

త న్నావేశించియుండెనే! తనకంటె విద్యలో గాని ప్రావీణ్యములో గాని అభ్యాసములో గాని వీరభద్రేశ్వరు డెక్కుడు కాడు. కాని మరి యాతడే మున్ను జయశాలి యయ్యెనే! ఆతడే వీర్యపణమున తన్ను ఒడుచుకొని హక్కుగా పొందగలిగెనే! విధికృతము! విధి వీరభద్రేశ్వరులకే ఆనాడు తోడ్పడినది. మరి యీనాడు విధి మాలో నెవరికి తోడగునో గదా! ఈనాడు ధర్మము నా పక్షమున నున్నది. నేను శివేచ్ఛ నిర్వర్తింప బూనియున్నాను. మరి విధి మాత్రము శివేచ్ఛల ననుసరింపదా!

ఇప్పుడు వా రెక్కడ నున్నారు? ఏమైరి? ఇప్పటికి ఇంకను ఈరాజధానీనగరము విడిచిపోయినట్లు తోచదు. ఒకచోట నొక మారువేషమున నున్నా రని చారులు జాసలుతీయునప్పటికి వా రా రూపమును స్థలమును మార్చుచున్నారు. నూరుకన్నులతో కనిపెట్టియుండు మేచయనాయకుని భటులనే వారు కనుబ్రామచున్నారు. ఆ భటులలో గూడ కొందరు వారి కంతరంగములలో వశులై యుందురా?

ఏది యేమైనను తాను వీరభద్రేశ్వరులపత్ని. వారిరువురకు వివాహమాదిగా నొండొరులపై దంపతులకు సామాన్యముగా నుండు ననుబంధమే ఏర్పడెను గాని కథలలో చెప్పుకొనునట్లు ఎవరికిని విపరీతవ్యామోహము ఎన్నడును కలుగలేదు. వారి కొకరి కొకరిపై నొక గౌరవభావము కలదు అంతే!

కొంతవడికి వీరభద్రేశ్వరునితో తాను సుఖముగా గడపినదినములు జ్ఞప్తికి వచ్చును. వా రన్న పల్కులు చేసిన చేతలు స్మృతిలో బారును. అవి యేమియు నంత ప్రధానమైనవి కావు. ఇంతకాలము జ్ఞప్తియందుంచుకొన నవసర మున్నవి కావు. ఒక చిన్నమాట, ఒక సన్నని చూపు, ఒక చిరునవ్వు, ముఖములో నొకమారు కలిగిన వైవర్ణ్యము, మరియొకమారు అకారణముగా వారు ధరించిన మౌనము!—ముప్పదిసంవత్సరముల సంసారములో నిట్టి వెన్నియుండును! వీరభద్రేశ్వరుల కెప్పుడు సౌమ్యత లేదు. ఎప్పుడును కర్కశులే. వారి సహవాసమును మొదటినుండియు కరకువారితోడనే.

ఉత్తరదేశములో సంచరించిననాడు తాము కావించిన క్రూరకృత్యము లెన్నియో వారు ఉత్సాహముతో తనకు వర్ణించిన దెన్నిమారులు! అవి విన్నంతనే తన హృదయమున శూలములతో పొడిచిన ట్లుండెడివి. వారు తాము తలంచిన కార్యము సాధించుటకు ఎట్టి కఠినకృత్యము చేయుటకును వెనుకాడరు. వారికి దయాదాక్షిణ్యములు లేవు. ధర్మాధర్మవిచక్షణ లేదు. అట్టివారు ఆ మహాసభలో ధర్మనిర్ణయము చేయు దని ధర్మస్వరూపులగు శ్రీ విశ్వేశ్వరశంభుదేశికుల నర్థించుట తన కెంతయో వెగటుగా దోచినది! ధర్మనిష్ఠులగువారి నోట ధర్మవాక్యములు శోభాయమానములుగా నుండును. పాపము, వీరభల్లటదేశికు లెంత మోటుగా చెప్పినను వారి మాటలు పూర్తిగా ధర్మబాహ్యము లనజెల్లదు. కాని యెట్టి ధర్మనిష్ఠయు లేని వీరభద్రేశ్వరులు ఆ యవకాశము పురస్కరించుకొని, ధర్మపన్నములు పలుకుచు, నంతవరకు మౌనము దాల్చియున్న శ్రీ రాజగురువులను ధర్మనిర్ణయము చేయ నర్థించుట సభలో నందరకును కష్ట మనిపించినది. తనకు ఒడలే మండిపోయినది. అయ్యో, ఇట్టివానికి పత్నినైతినే యనిపించినది. పత్నికి భర్తపై నెంత కోపము రా వలెనో అంతకోపమును దనకు వచ్చినది.

తుద కా సాహసప్రశ్నము గుహాంతరమున సుఖముగా నిద్రపోవుచున్న సింహమును కదలించుటయే యైనది. ఆ మహాసభలో మహాప్రభువులు ప్రధానులు పండితులు అనేకు లుండిరి. వా రెవ్వరికిని స్ఫురింపని ధర్మసూక్ష్మము శ్రీవిశ్వేశ్వరశంభుదేశికులకు స్ఫురించినది. అది వారి యాత్మవాక్కు, శివవాక్కు! ఈ మాదైన విధి నా కనుకూలింపకుండునా?

శ్రీ గురువుల యాదేశముచే నీ రాజ్యభారము భరింప నీనాడు నేను తల యొగ్గినాను. నాకు ప్రభుత్వము నెరపవలెనని యెట్టి బులబాటమును లేదు. రాజ్యాంతమున నరకము ధ్రువ మందురు. ఇప్పుడే నేను నరకయాతన కొంత చవిచూచుచున్నాను.

పాప మా యన్నమంత్రిని నే నెందుకు బంధింప ననుజ్ఞయిచ్చినట్లు! సాక్ష్య మున్నదనియే కదా! అది యంతయు మిథ్యాకల్పితసాక్ష్య మని నా విశ్వాసము. ఆ మంత్రీశ్వరుడే తన్ను బంధించుట యుక్త మని శాంతముగా నియోగించెనే! ఆయనముఖము చూచినంతనే నిర్దోషి యని ముఖమున వ్రాసియున్నట్లు కనబడుచుండెనే! అట్టివానిని నిర్బంధములో నుంచిన నా పాపమునకు నిర్వృతి యేముండును? ఆయన నిర్దోషి యని యెప్పుడు నిర్ధారిత మగును? ఎట్లు?

వీరభద్రేశ్వరులకు మొండిపట్టు గాని యిప్పటికిమాత్రము మించిపోయిన దేమి? ఈ దాగుడుమూత లాడి యీ సామ్రాజ్యమును, తన్ను, తన కుమారులను, అపాయములపాలు చేయక ఎదుటబడినచో, వారికి కఠినముగా శిక్ష విధింప దనకు సాధ్య మగునా? మహారణము చేసి విజితుడైన శత్రువునే పాదాక్రాంతుడైనచో క్షమించి వానిపదవి మరల వాని కిచ్చి విడిచిపుచ్చుట క్షత్రియాచారమే! ఇక తాను తన భర్తవిషయమున వేరుధర్మ మవలంబించుట సాధ్యమా? అది తెలిసియున్నందుననే వీరభద్రు లింత నిష్కరుణముగా ప్రవర్తించుచుండవలెను.

వారితో నాకు గలిగిన యీ ఎడబాటు రుయ్యమ్మ కెంతో కష్టముగా నున్నది. కన్నకూతు రగు ముమ్మడయ్యకే అట్లు లేదు. ఇదియు నొక విచిత్రవిషయము! నేను పదిమాసములు మోసి కన్న ముమ్మడయ్యకన్న రుయ్యమ్మకు మాపై నింత స్నేహ మేలని? నాకును ముమ్మడయ్యపైని గన్న దృఢతర మగు ననుబంధము రుయ్యమ్మపై గలుగు టేల? కన్నమోహముకన్న పెంచినమోహ మెక్కువ యందు రిట్టిదే కాబోలును!

వీరభద్రేశ్వరులతో వియోగము ప్రాప్తించిననాటినుండియు నెమ్మదినెమ్మదిగా నాకు రుయ్యమ్మమనస్సును దూరమగుచున్నది. ప్రతాపరుద్రకుమారుని సాహచర్యము కూడ రుయ్యమలోటు తీర్పలేకున్నది. ఆ పిల్లకు హృదయాంతరమున నేదో బాధ యున్నది!

ఈ విధముగా నాలోచించుకొనుచు రుద్రమ యొకనాటి ప్రాతఃకాలమున దనమందిరములో గూర్చుండియుండి వాతాయనములనుండి స్వయంభూదేవాలయశిఖరమును పరధ్యానముగా తిలకించుచుండెను. అన్నిశబ్దములను పరిహరించి యామె చెవులలో సన్నగా నొక వీణానాదము వినబడినట్లయినది. అంతలో దీన మగు నొక కంఠస్వరముకూడ దానితో సమ్మిళితమై వినవచ్చెను.

'దఇఅ రహిఓ అహిఅం దుహిఓ
విరహాణుగోఓ పరిమంథరఓ

(35 వ పేజీ చూడుడు)

# ధూమపానం



[ రోజర్ విలియమ్స్ రైసి ]

మానవులపైన ధూమపానం పెద్దపెట్టున దండెత్తివచ్చింది. చరిత్రలో ఇంతటి విపరీతపరిణామం ఇదేకాని మరొకటి లేదు. ఒకే ఒక్క తరంలో ఈ మహాశక్తి మానవుని తనకు దాసునిగా చేసుకుంది. దీని ప్రభావం మనపైన ఎంతఉందో మనం ఇంకా గ్రహించడంలేదు దీని ఫలితాల్ని అంతకంటె గ్రహించలేకపోతున్నాం.

అమెరికా ఒక్కటే తీసుకొని చూద్దాం. 1949 లో ఆరుకోట్లమంది అమెరికన్లు 40 వేల కోట్లు సిగరెట్లు ఊదేశారు. ప్రతి ఏడాదీ ఎనిమిదిలక్షలమంది కొత్తగా వీరితో సహవాసంచేస్తున్నారు. ప్రతిముగ్గురు మగవాళ్లలో ఇద్దరు సిగరెట్లు కాలుస్తున్నారు. ప్రతి అయిదుగురు ఆడవాళ్లలో ఇద్దరు, పధ్నాలుగేళ్ల కుర్రవాళ్లలో ప్రతి ఏడుగురికి ఒకడు సిగరెట్లు కాల్చేవాళ్లే. ఖర్చునిబట్టి చూస్తే అమెరికాలో ఉపాధ్యాయులందరూ కలిసి పుచ్చుకుంటున్న జీతాల మొత్తానికి సిగరెట్ల ఖర్చు రెట్టింపుపైగా ఉంది. ప్రతియేడూ సిగరెట్ల ఖర్చు ఎక్కువైపోతోంది. కాల్చి ఊదేసేసిగరెట్ల జనాభా మరీ పెరిగిపోతోంది. ఎంగిలో ప్రజ్ఞ ఉన్నా లేకపోయినా మనదేశంలో కూడా ఈ ప్రజ్ఞ అందరికీ అబ్బుతోంది. భారతదేశాన్నికూడా బ్రహ్మాండమైన చుట్టలూ సిగరెట్లూపొగ మేఘం, ఆవరించేసింది. ఈ మేఘం నానాటికీ పెద్దదౌతోంది. మనదేశంలో ప్రభుత్వం ఎన్ని కోట్ల రూపాయలు ఖర్చుపెట్టినా ఆహారోత్పత్తి పీసం పెరగడం లేదుకాని,' దానీ ఖర్చు పెట్టకపోయినా పొగాకుపంట విస్తరించిపోతోంది. ప్రభుత్వానికి పొగాకు పన్నువల్ల ఆదాయం ప్రతియేడూ కొన్ని కోట్ల రూపాయల చొప్పున పెరుగుతోంది.

చుట్టలూ సిగరెట్లు కాలుస్తోంటే కొంత పొగ ఆకాశంలోకి పోతోంది. కొంత పొగ ఊపిరితిత్తుల్లోకి ప్రవేశిస్తోంది.

ఇంతాచేస్తే మనం పీల్చేది ఏమిటి?

డాక్టర్లనికాని విజ్ఞానశాస్త్రజ్ఞుల్ని కాని అడిగితే ఏవో చాలా పెద్ద పేర్లు ఇంగ్లీషువీ లాటినవీ చెప్తారు. ఏదో విషం కూడా పుచ్చుకుంటున్నామని డాక్టర్లు చెప్తారు. అయితే మానాలనిమాత్రం డాక్టర్లు చెప్పరు. సిగరెట్టు పెదవులపైన వేళ్లాడేసుకుంటూ తిరగని డాక్టర్లు బహుకొద్దిమంది కనిపిస్తారు. అందువల్ల ధూమపానం మానాలని చెప్పే డాక్టర్లు లేరు. ఒకవేళ చెప్పేవాళ్లున్నా ఖాతరీచెయ్యడం ఎల్లా?

ఆ పొగాకు పొగలో ఉండే విషాల పేర్లు ఏమిటి? అవి రెండున్నాయిట. ఒకదాని పేరు బెంజో-పైరీన్. రెండోది నికొటిన్.

నికొటిన్ అనేది పొగాకు సొమ్ముట. ఎండుగడ్డికీ పొగాక్కీ తేడా ఉందంటే దానివల్లేట.

పొగ వొదుల్తోంటే నికొటిన్ చాలా మటుకు గాలిలో కలిసిపోతుంది. మూడో వంతుమాత్రం నోట్లోకి వెళ్లి మనిషి జీర్ణించుకుంటాడు. ఊపిరితిత్తుల్లోకి ప్రవేశించేది మొత్తంలో అయిదోవంతుండవచ్చు.

చుట్టకాలిస్తే నాలుగైదు సిగరెట్లు కాల్చిన ఫలం. పైప్ కాలిస్తే దీనిమీద ఒక్కరవ్వ అధికం.

కాలేచివర వేడి ఎంత అధికంగా ఉంటే అంత అధికంగా నికొటిన్ లోపలికి ప్రవేశిస్తుంది. అందువల్ల సిగరెట్టుని కసితో పట్టి ఆత్రంతో పీలిస్తే మరింత నికొటిన్ ప్రవేశిస్తుంది. రెట్టింపు వేగంతో దమ్ములాగితే పదిరెట్లు నికొటిన్ ఎక్కుతుంది. కొందరు సిగరెట్టుని కొసవరకూ కట్టిపట్టేస్తారు. వారికి నికొటిన్ దేవటంటే ప్రీతి మరీ అధికమన్నమాట.

నికొటిన్ పొగాకు పొగలో ఉంది కాబట్టి సరిపోయింది. నికరమైనదైతే అది ప్రాణాంతకమైన విషమన్నమాట. ఒక్క చుక్క తీసి చిన్నకుక్కపిల మీద వేస్తే. దెబ్బకి బుర్ర తిరిగిపడిపోతుంది. నాలుగు సిగరెట్లలో ఉన్న నికొటిన్ సారాన్ని తీసి ఆ సిగరెట్లు పీల్చేవాడి రక్తంలోకి ఇంజక్ట్ చేస్తే మళ్లీ మాట్లాడకుండా టపా కట్టేస్తాడు. రోజుకో పెట్టె సిగరెట్లు కాలుస్తున్నారంటే, వారానికి 400 మిల్లీగ్రాముల నికొటిన్ లోపలికి పుచ్చుకుంటున్నారన్నమాట. అదే ఇంజక్షన్లో ఇస్తే, తుపాకీ గుండులా పనిచేస్తుంది.

క్రిమిసంహారంకోసం నికొటిన్ విషం తయారుచేసే ఫాక్టరీల్లో తరుచు ప్రమాదాలు సంభవిస్తూఉంటాయి. ఒక ఫాక్టరీలో ఒకడు కుర్చీమీద కూచున్నాడే కూచుని చిటికెలో స్పృహతప్పి పడిపోయాడు. ఎందువల్లనంటే కుర్చీలో కొద్దిగా నికొటిన్ మరకలు పడ్డాయిట. వాణ్ణి గబగబా ఆస్పత్రికి చేర్చి చికిత్సచేసేసరికి తేరుకున్నాడు. తేరుకున్నాక మర్నాడు ఫాక్టరీకి వెళ్ళి ఖాకీచొక్కా తొడుక్కునేసరికి మళ్ళీ పడిపోయాడు. మళ్ళీ ఆస్పత్రికి మోసెయ్యాల్సి వచ్చింది.

పొగతాగుతూ ఈ విషం ఎక్కకుండా చెయ్యడానికి చాలామంది చాలావిధాల ప్రయత్నాలు చేశారు. పొగ పెదవులుదాటే లోగా వడపోతపెట్టడానికి ప్రయత్నాలు చేశారు. అయితే ఎన్ని వడపోతలుపెట్టినా చివరికి కొస్తోకూస్తో ప్రవేశించక మానడం లేదు.

నికొటిన్ భయంకరమైన విషం. అమెరికాలో ఆరుకోట్లమంది కాలుస్తున్న పొగాకులో ఉన్న విషాన్ని నికరంగా తీస్తే దాంతో అమెరికాలో ఉన్న జనాభాని వెయ్యిరెట్లమందిని చంపెయ్యొచ్చు. మరి ఇదంతటి విషమైతే సిగరెట్లు కాలుస్తున్న వాళ్లు చచ్చిపోరెందుచేత? నల్లమందులాగా. పాషాణంలాగా మోతాదుకాతాదుగా పుచ్చుకోడం ఆరంభిస్తే శరీరాలు చక్కగా అలవాటు పడతాయి కాబట్టి. అదీకాక పొగలో కలిసి ప్రవేశించే విషం ఒంటిలో అట్టే జీర్ణంకాదు ఇంక మరి పొగతాగినందువల్ల కలిగే నష్టాలేమిటి?

ముందుగా గొంతుకసంగతి చూద్దాం. గొంతుకలో పుండు ఏర్పడతుందా? ఏర్పడుతుందని కొందరు డాక్టర్లంటారు. అది రోజుకి ఎన్ని కాలుస్తున్నారో దాన్నిబట్టి ఉంటుంది. రోజుకి ఒక పెట్టె (10 సిగరెట్లు)

(38-వ పేజీ చూడుడు)

# కార్మికుల సహకారం

(గల్పిక)

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు

యుద్ధం జోరుగా సాగుతోంది.

హిట్లరుకు వెన్నిచ్చి పారిపోయివచ్చిన తెల్లవాళ్లు ఇండియాలో ఫాక్టరీలు పెట్టి యుద్ధ సహాయం ఆరంభించారు. స్కాట్లాండులోనూ హాంబర్గులోనూ కూలీలుగా పనిచేసి చేతులూ మొహాలూ మసిచేసుకొన్న దొరలు మార్వాడీలదగ్గిరా, గుజరాతీవాళ్ల దగ్గిరా పెట్టుబడులు సంపాదించి ఫాక్టరీలు నడిపి, తాము ఎన్నడూ కనీవినని యుద్ధపరికరాలు — అతిచిన్నవి — తయారుచేసి లక్షలు గడించి, ఖరీదైన కార్లలో తిరగసాగారు.

అటువంటిఫాక్టరీకి ఒకనాడు ఒక దొరగారు — అసలైన సీమదొర — ఇండియా ప్రభుత్వంతరపున తణిఖీకి వచ్చాడు.

డైకాస్టింగుయంత్రాలు పనిచేస్తున్నాయి. దొరగారు పనిచేసేవారి కేసి చూశాడు. వాళ్ల మొహాలమీద కారే చెమట ఆయనకు చాలా తృప్తి కలిగించింది. వాళ్ల చురుకుదనం కూడా ఆయనకు తృప్తికరంగా ఉంది. (దొరగారున్నంతసేపూ జోరుగా పని చెయ్యమని సూపర్వైజరు వాళ్లతో చెప్పి ఉన్నాడు.)

సీమదొరవెంట ఫాక్టరీ దొరలుకూడా ఉన్నారు.

"వాళ్లు ఏం చేస్తున్నారు వాళ్లకు తెలుసునా?" అన్నాడు ఇంగ్లీషుదొర ఇంగ్లీషు రానిదొరలతో.

వాళ్లు మూడునాలుగుసార్లు నోళ్లు తెరిచి మూసి ఆఖరుకు సూపర్వయిజరును పిలిచి అదేప్రశ్న వేశారు.

"వాళ్లేపాపం ఎరగరు," అన్నాడు సూ.

"వాళ్లకు తెలియాలి. ఈ యుద్ధంలో వాళ్లు హిట్లరుకు విరుద్ధంగా మారణాస్త్రభాగాలు తయారుచేస్తున్నారు. అవి ఎట్లా ఉపయోగపడేదీ వాళ్లకు తెలియాలి. అప్పుడుగాని వాళ్లు ఉత్సాహంతో పనిచెయ్యరు. నువు చదువుకున్నవాడివి. వాళ్లకు చెప్పాలి," అన్నాడు సీమదొర.

"చెబుదును గాని, నాకే తెలీదు," అన్నాడు సూపర్వయిజరు.

"చూడు," అన్నాడు సీమదొర జాలిగా, "నువు చేస్తున్న ఈ భాగాన్ని ఫ్యూజ్ కాప్ అంటారు. దీన్ని చేతిబాంబుల్లో వాడతారు. చేతిబాంబు ఇది లేకపోతే పేలదు. చేతిబాంబుకు ఒక స్ప్రింగ్ ఉంటుంది. మామూలుగా దాన్ని రింగు ఒకటి అదిమి పట్టిఉంటుంది. ఆ రింగు తీసి, స్ప్రింగును చేత్తోనొక్కి పట్టి బాంబును శత్రువు మీద విసురుతావు. ఆ విసరడంలో స్ప్రింగు పైకి తన్నుతుంది. తన్నినతరవాత సరిగా ఏడు సెకండ్లకు బాంబు పేలుతుంది. అది పేలినప్పుడు —ఈవిధంగా ఆయన చెప్పుకుపోయినాడు.

"ఈవిషయాలన్నీ పనివాళ్లకు చెప్పు" అన్నారు, హిట్లరునోట గడ్డ కొట్టివచ్చిన దొరలు.

దొరలంతా వెళ్లిపోయినారు.

"ఏయ్, అందరు ఇట్లా రండి...ఇది చూశారా. దీనిపేరు ఫ్యూజ్ కాప్. అంటే ఏమిటో మీకు తెలీదు. దీన్ని తయారుచెయ్యటానికి ఫాక్టరీ అర్థణా ఖర్చుచేస్తుంది. గవర్నమెంటువారు దీన్ని మనదగ్గిర ఏడణాలకు కొంటారు. ఇందువల్లనే మనఫాక్టరీ యాభైవేలరూపాయల పెట్టుబడితో అయిదు లక్షుల యంత్రాలు కొన్నది. దీన్ని ఇవాళ ఆరులక్షులకు దొరలు అమ్మజూపుతున్నారు. అది మనకు అప్రస్తుతం.

"ఈ మారణయంత్రాలు ముఖ్యంగా బర్మారంగానికి పంపుతారు. అక్కడ దొరలు వీటికి చాలా రోజులు కాపలా కాని వెళ్లేటప్పుడు కోతబడునని వదిలేసి పోతారు. వాటిని జపానువాళ్లు స్వాధీనపరచుకుని ఇండియాకు తెచ్చి మనమీద వేస్తారు. అది వేరే కథ.

"ముఖ్యమైనవిషయ మేమంటే ఈ పని మీరెంత చురుకుగా చేస్తే మారణాయుధాలు అంతచురుకుగా తయారై యుద్ధం అంత త్వరగా అయిపోతుంది. యుద్ధం త్వరగా అయిపోయిందంటే, పన్నెండుగంటల రోజుకూలి మీద తిండికి కూడా సరిగా జరగని మీరు ఈ చెరనుండి విముక్తి పొంది, గ్రామాలకు పోయి వీలయితే హాయిగా గొర్రెల్ని కాసుకోవచ్చు," అన్నాడు సూపర్వయిజరు.

"హాహా!" "శాబాష్!" అన్నారు కార్మికులు.

అప్పుడే డైకాస్టింగుఖాతాలోకి తొంగి చూచిన ఫాక్టరీదొర ఒకడు, సూపర్వయిజరు కార్మికులను ఉత్సాహపరుస్తూ ఉండటం చూసి సహించలేక, "ఏమిటి మీటింగు? పోయి పని చూడండి! క్విక్, క్విక్!" అని అదిలించాడు.

---

# అద్దె యిల్లు

రచన: "జయ"

మూలం: శ్రీ వై. యస్. శర్మ

"ఇలా హోటలు కాపరం ఎన్నాళ్లు నిర్వహిస్తావురా అబ్బాయీ? రోజుకు రూపాయిన్నరంటే మాటలా? నీకొచ్చే ఏభై రూపాయిల్లో!" గట్టిగానే మందలించారు వాత్సల్యంతో లాయరు సర్వేశ్వర్రావుగారు కొత్తగా కాపరంతో బస్తీకి జేరిన కృష్ణమూర్తిని.

"ఏంచెయ్యను బాబాయి! ఇంత బస్తీలో తలదాచుకోటానికి బెత్తెడు జాగా దొరకదాయెను. నెలకు యాభై అరవై చొప్పున వందలూ వేలూ అడ్వాన్సులు కుమ్మరిస్తే వాటితో యిల్లుకట్టించి యిస్తారుట! మీవంటి పలుకుబడిగలవాళ్లు ఉండికూడా ఇంత నీడ చూపించలేరాయెను!!" ఎదురు నిష్ఠురం విసిరాడు కృష్ణమూర్తి చనువుతీసుకొని.

లాయరుగారు కొంచం తటపటాయించి, "అవున్రా, అదే చూస్తున్నాను 'అబ్బాయికి మీవూళ్లో వుద్యోగమైంది, కొత్తగా కాపరం తెస్తున్నాడు. అక్కడ మీకంటె ఆప్తులు మరెవరూ లేరు. వాళ్ళను కాస్త కనిపెట్టి ఉండండని' నాన్న రాసిన వుత్తరం చూచిందాకా మీరక్కడ వున్నట్టే తెలియదు! ఏం యకాయకి మాయింటికి వచ్చెయ్యక పోయినారూ? మేమేం పరాయివాళ్ళమట్రా? నాన్నకూ నాకూ ప్రాణస్నేహం, తెలుసా? హోటలుకు అద్దెకట్టేసి రండి. ఇల్లు దొరికిందాకా మాతోనే వుందురుగాని." కన్నతండ్రికంటె ఎక్కువ యిదిగా పరామర్శించారు.

"ఎందుకులెండి మిమ్మల్నిబ్బందిపెట్టటం? ఏదో ఓయిల్లు చూచుకొన్నదాకా యిలానే తిప్పలుపడతాం" కృతజ్ఞత తెలిపాడు కృష్ణమూర్తి తమ విషయంలో ఆయన తీసుకొంటున్న శ్రద్ధకు.

"నీమొహంగాదూ! ఇబ్బందేమిటి మనలో మనకు; వెంటనే వచ్చెయ్యండి."

ప్రేమతో పిలుస్తుంటే కాదనలేకపోయినాడు కృష్ణమూర్తి. సాయంత్రమే బండి కట్టించుకొని బయల్దేరారు దంపతులు, చెప్పిన యింటి అడ్రెస్ సరిచూసుకుంటూ.

అల్లంతదూరాన చూస్తూనే ఎదురొచ్చి "రండర్రా! మీకోసమే చూస్తున్నాను. మీరొస్తున్నారంటే మీపిన్ని ఎంతసంతోషపడ్డదనుకున్నారూ! 'పాపం పసివాళ్లు' ఒంటరిగా ఎక్కణ్ణో విసిరేసినట్టుంచ మేమిటే వాళ్ళను; మంచిపని చేశారు! యిబ్బందైతే కానివ్వండి అలానే సర్దుకుందాం; వాళ్ల యిబ్బంది ఒకటే మన యిబ్బంది ఒకటేనా? అని అప్పటికప్పుడు పనిమనిషిని పిలిపించి స్వయంగా దగ్గిరుండి కడిగించింది యిల్లు! ఏమే! మనవాళ్లొచ్చారు తీసుకెళ్లి యిల్లదీ చూపించు!!" ఆజ్ఞ యిచ్చాడు అర్ధాంగికి.

ఆమె సొంత కోడల్ని చూసుకొన్నట్టు పరవశమే ఐపోయింది! "రావే చిట్టితల్లీ యిల్లు చూచుకుందువుగాని" ఆ ఆపేక్షకు పొంగిపోయిందా లేతజంట.

"యిల్లు చూశారా? పెట్టెలే ఎలా వుందోనూ? చిత్రమేమిటి తెలుసా? ఈ యిల్లు వేసవికాలం చల్లగా వుంటుంది, చలికాలం వెచ్చగా వుంటుంది! ఎప్పుడన్నా ఉక్కపోస్తే ఎలెక్ట్రిక్ ఫాన్ వుండనే వున్నది, మరో ఐదురూపాయలు మనవి కావనుకుంటే సరిపోయె! ఇదే యింకోళ్ళయితే యాభైకి దమ్మిడీ తక్కువతీసుకో రీరణబస్తీలో. జీతం రాగానే ఓ యిరవై అవతల పారేస్తూ హాయిగా వుండండి!" అరచేతులో వైకుంఠం చూపిస్తూ వరించుకుపోయింది చీకటి గుహ్వరమైన గరాజిని!

నెలవ నీడదొరికినందుకే సంతోషించారు కృష్ణమూర్తీ సరితానూ! గరాజికి సరిగ్గా ఉత్తరదిక్కున కక్కసు. ఏ కొంచెం గాలి వచ్చినా ముక్కులు పగిలిపోతున్నై. ఇంటికి ముందూ ప్రక్కనా మురుగుకాలవ ఊరకల పెడుతుంటుంది మూడువందల అరవై రోజులూ జీవనది గంగాప్రవాహంలా. గరాజికి వెనుకగానే కక్కసుకు పోయేసం వుంటటంవల్ల అటువైపు మగవాళ్లు వెళ్తున్నప్పుడల్లా దొడ్డితలుపు మూసుకోవల వచ్చేది సరితకు. ఎలాగో సర్దుకుపోవాలిసు పరాయివూరొచ్చి మనయింటిదగ్గిరికిమ అన్ని వసతులూ కుదరాలంటే ఎలాగ?

ఒకనాటి సాయంత్రం ఉబుసుపోటానికని సరిత తన చిన్నతనంలో నేర్చుకున్న త్యాగరాయకృతి ఒకటి పాడటం మొదలుపెట్టేసరికల్లా ఇంటా పరిగెత్తుకొచ్చి

"ఈకాలపు పిల్లలకు మంచీ చెడ్డా తెలియదు మరీనీ! పరాయియింటికి వచ్చినప్పుడు అవతలవాళ్లేమనుకొంటారో అన్న జ్ఞానమన్నా లేకుండా ఈ అల్లరేమిటి చెవులు పగిలిపోయేటట్టు? ఐనా సంసారం జేసుకొనేవాళ్లకు సంగీతాలేమిటి సినిమా వాళ్లకుమల్లే!" అన్నది. ఆమెలా అణగివున్న అత్తగారి అంశకు హడలిపోయి కృష్ణమూర్తి రాగానే చెప్పుకొని వెక్కివెక్కి ఏడిచింది సరిత. ఏమైతేనేం అంత పుత్రవాత్సల్యంతో పిలుచుకువచ్చిన పెద్దమనిషి యెదటిబడి అడిగేందుకు సాహసించలేక పోయింది, సుమాస్త్రాగ్రికి అంకితమైపోయి కృష్ణమూర్తిమనస్తత్వం.

బస్తీతిండి పడకనో మురుగుకాలవలో సావరం ఏర్పరచుకున్న దోమలకు నిత్య నైవేద్యం జరుగుతుండటంవల్లో తెలియదు కాని వంతులువేసుకుని జబ్బులుపడుతున్నారు కృష్ణమూర్తీ అతని భార్యానూ!

ఒకరోజు కృష్ణమూర్తిని డాక్టరు పక్కకు పిలిచి—

"ఈ యింట్లో మరో నెల ఉంచితే నీ భార్య బతకదని నిర్మొహమాటంగా తెగేసి చెప్పి చెక్కాపోయినాడు!

విధిలేక నౌకరీకి సెలవుపెట్టి గంటు కంట్రోలు ఆఫీసరుచుట్టూ తిరిగి ప్రైసంత

త్వరలో ఏదో ఒకయిల్లు కుదిర్చి యిప్పించమని మరీమరీ ఒతిమాలి చెప్పివచ్చాడు. పాపం ఆయన ఏమనుకున్నాడో వారం రోజుల్లోనే యిల్లు కేటాయించి కబురు చేశాడు.

విడిగా యిల్లూ, తోటా, దొడ్డీ, దొడ్లో మంచినీటి పంపూ, ఆఫీసుల్లుండేందుకు తగ్గట్టుగా వుంది, అద్దె యిరవైయేదు! శని విరగ్గడైందని సంతోషించాడు కృష్ణమూర్తి. భార్య చూసి మొదట బాగానేవుందన్నదిగాని ఇంట్లో తీరా చేరినతరువాత నసుగుడు మొదలుపెట్టింది.

“ఇందులో ఏదో తిక్కుడి వుందండీ! ఇంతయిల్లు పాతికరూపాయల కెవరన్నా యిస్తారటండీ?”

రానురాను ఆవిడ కాయింట్లో దయ్యాలు కనుపించటం, పీక్కుతింటామని బెదరించటం, దానికితగ్గట్టు ఆయింట్లో చేరిన నెలతిరిగే లోగానే ఆమె ముత్తవతల్లి చచ్చిపోవటం అన్నీకలిసి అది దయ్యాలకొంపే అని ఆమెకు సాక్ష్యం పలికినై!

“ఈ యింట్లో ఒక్క క్షణం వుండొద్దు మనం! పోదాం పదండి మరెక్కడికన్నా, మీకు పుణ్యముంటుంది.”అని ఊదర పెట్టింది సరిత!

“అద్దె యిచ్చినప్పుడు పుచ్చుకుంటున్నారు, ఏ గొడవా లేకుండా మనంతట మనం హాయిగా బతుకుతున్నాం! ఈ వసతి మరో చోట రాదు!” ఎంతో ప్రయత్నించాడు కృష్ణమూర్తి వద్దని నచ్చచెప్పేందుకు.

“అయ్యో! మీ పిచ్చి బంగారంగానూ! ఇంట్లో ఏ తిరుగుడు లేకపోతే నెల కాంగానే అద్దె టకాయించి పుచ్చుకోరుటండీ? ఇంత అమాయకులేమండీ? మీకు చక్కని కొంటుక వేశారు. ఇది దయ్యాలకొంపని స్పష్టంగా తెలబడుతుంటేనే! చాల్లెండి, ముందు మరో కొంప చూడండి పోదాం అవతలబడి.”

కాలికి బలపం కట్టుకు తిరుగుతూనే వున్నాడు కృష్ణమూర్తి! యిల్లు బాగుంటే దొడ్డి చాలకా, దొడ్డివుంటే దీపాలు లేకా, దీపాలుంటే వెలుతురు లేకా అన్నీవుంటే దిక్కులు సరిపోకా ఒకటే నచ్చలేదు!

ఊరికి వెలపల కొంచెం దూరంగా ఒక విశాలమైన యిల్లు కనిపించింది. గాలి గోడలూ, తాబాగడులూ, కిటికీలకు అద్దాలు తలుపులూ ఎలక్ట్రిక్ లైట్లూ నీటికొళాయిలూ చూడ ముచ్చటగా వుంది! “అద్దెకు” అని బోర్డుకూడా వుంది!! ఆలస్యమైతే మించి పోతుందని యజమానియిల్లు కనుక్కొని వెంటనే పరిగెత్తి తలుపుతట్టాడు కృష్ణమూర్తి.

“ఎవరండీయింట్లో?”

“ఎందుకు బాబూ?” నలభై యేళ్ల ఆడ గొంతు పలికింది.

“ఇల్లద్దెకిస్తారాండి?”

“అబ్బే లేదు! ఎవరిక్కావాలి?”

“మాకే.”

“ఎంతమంది మీరు?”

“ఇద్దరం!”

“ఇంతేగదా! ఈ యిల్లు మాకిందే వుంచుకుంటాం. అవతల మరో యిల్లుంది. చక్కగా గాలీ వెలుతురూ, కమ్మని మంచి నీరూ మంచి వసతైన యిల్లులే!”

“కొంచం పెడగా వున్నట్టుందండీ వూరికి!”

“ఏమిటో! ఊళ్లోఉండి గాలీ వెలుతురూ లేని యిళ్లల్లో యిలా కుమిలిపోవటం చూస్తూనే యింటిమీద మరో యిల్లు ఇక్కణ్ణే ఎలా కట్టం చెప్పు బాబూ!”

“అద్దె యెంతేమిటండీ?”

“ఎంతో అంత యిద్దువుగానిలే నాయనా, డబ్బు శాశ్వతమాఏమిటిగనక! నిలబడే వున్నావు కూచో! మంచినీళ్లేమన్నా కావాలా!” ఎంతో ఆపేక్షగా పరామర్శించింది

“మీకైతే యిద్దరేగనక శేషుగ్గా సరి పోతుంది! మంచిరోజు మాసుకొని దిగండి! స్వామిచల్లగా చూసి మీకడుపున ఓ కాయ గాస్తే ఎప్పుడన్నా వచ్చి ఎత్తుకుంటాను.”

ఉంటారుగావును ప్రపంచంలో దయగల వాళ్ళుకూడా!

“ఎన్నాళ్లయిందండీ ఇల్లు ఖాళీ అయి?”

“ఎన్నాళ్లెక్కడిది నాయనా? రొణ్ణాళ్లే! వందలమంది వచ్చిపోతున్నారు!! ఆఫీసులు తెరిచే రోజులుగాదూ. జనం గిజగిజలాడి పోరికనూ యిళ్లు దొరక్క? కొత్త ఉద్యోగులుగా, మంచివాళ్ళనుగా చూసి యిద్దామని శుభ్రంగా కడిగిపెట్టి వుంచాం.

“ఇదివరకెవరుండేవారండీ ఆ యింట్లో?”

ఆదరంగా యిల్లిచ్చి వుండమంటుంటే ఇలా విషమప్రశ్నలు వేస్తున్నందుకు పాపం ఆ యిల్లాలు చాలా నొచ్చుకున్నది.

“మొన్నటిదాకా గవర్నమెంటువారి కిందే వుంది నాయనా అది!”

“ఏమిటో ఆ ఆఫీసు” కృష్ణమూర్తి ప్రశ్నకు అంతు కనబట్టంలేదు. వుండబట్ట లేక అడిగేసింది.

“సుఖంగా వచ్చి చేరక, ఎందుకు బాబూ యీ ప్రశ్నలన్నీనూ?”

“ఊరికనే తెలుసుకుందామని.”

“ఏదో యింగ్లీషుపేరు నాయనా ఆ ఆఫీసు నోరు తిరగటంలేదు, పోస్టాఫీసా? ఏమిటే అది అమ్మాయి?”

“పోస్టుమార్టం!” చిరునవ్వు నవ్వింది పదహారేళ్ళ పడుచుపిల్ల, కూతురుగావును.

నిలువుగుడ్లుబడ్డ కృష్ణమూర్తి అలాగే నిలబడిపోయినాడు!



అఖిలభారత దిగంబర్ జైనమహాసభవారు ఏప్రెల్ 16 న రిపబ్లిక్ అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్‌గారికి న్యూఢిల్లీలో సన్మానంచేసినప్పటి దృశ్యం.

# పల్లెలలో పరిస్థితులు

మద్రాసురాష్ట్రంలో మొత్తం 35,000 పైగా గ్రామాలు ఉన్నయ్. 407 బస్తీలు, పట్టణాలు ఉన్నయ్. ఆంధ్రదేశంలో పల్లెలు 16,000 పైన, బస్తీలు 150 పైన ఉన్నయ్. మొత్తం తెలుగుప్రజల్లో, అంటే 1,87,84,304 మందిలో (1941 లెక్కలప్రకారం), 1,63, 93,288 మంది పల్లెలలో నివసిస్తున్నారు. 23,91,016 మంది బస్తీల్లో నివసస్తున్నారు. అంటే మొత్తంజనాభాలో ప్రతిఎనిమిది మందిలో ఒక్కడే బస్తీలో ఉంటున్నాడు. ఈపదేళ్ళలో పరిస్థితి మారిఉంటుంది. పల్లెల నుంచీ బస్తీలకు వలసపోతున్న వారిసంఖ్య ఇదివరకటికంటె అధికమైంది. జీవనంకోసం, పల్లెలలో తోచకపోబట్టి, బస్తీలలో విలాసార్థం అనేకు లీనాడు పల్లెలను విడిచిపెట్టిపోతున్నారు, ఈ వలసమూలంగా పల్లెస్థితులు మారి, నానాటికీ విషమిస్తున్నయ్.

100 కి 80 మందికిపైగా ఉంటున్న పల్లెలు బాగుపడితేనే, ప్రజాజీవితం వికాసంపొందుతుంది. ఇప్పటి అధ్వాన్నపుస్థితిని చక్కబరచకుండా, మాన్పూకూర్చుంటే, ప్రజాజీవితం ఇంకా మరింత హీనస్థాయికి పతనమౌతుంది.

ముఖ్యంగా ఈరెండుమూడేళ్ళనుంచీ పల్లెలలో వాతావరణం బాగా చెడిపోతోంది. కమ్యూనిస్టులఅరాచకం ఆరంభమయాక, పల్లెలు ఘర్షణలకు రంగమై, కల్లోలానికి గురి అవుతున్నయ్.

కమ్యూనిస్టుల అరాచకంకూడా బస్తీలలో కనపడదు. ఎక్కువ గ్రామాలలోనే చెలామణి అవుతుంది. దీనికి రెండు కారణాలు. ఒకటి బస్తీలలో పోలీసుసిబ్బంది హెచ్చు, రెండవది బస్తీలలో జనం ఇటు కమ్యూనిస్టులప్రాబల్యానికిగాని, అటు ప్రభుత్వపు తీవ్రచర్యలకుగాని సులభంగా తలొగ్గరు. కట్టుదిట్టంగా వ్యక్తులు, ఇతరపార్టీలు బస్తీలలో పనిచేయ్యటంమూలముగా, కమ్యూనిస్టులకు సావకాశం ఉండదు.

ఇక పల్లెలవిషయం. పోలీసు సిబ్బంది తక్కువ. ఫిర్కా లేక పోలీసుస్టేషన్. పల్లెలో అంతా జరిగాక, అప్పుడు వస్తారు పోలీసులు. ఈలోపు సాయుధులైన కమ్యూనిస్టులు గైరుహాజరు కాగా, వచ్చినపోలీసు ఏమీ తోచక, చేసేదిలేక, గుబులుపుట్టితే అనుమానంకొద్దీ ఊళ్ళోవాళ్ళకు దేహశుద్ధి చేస్తారు. పల్లెప్రజలలో నిలబడి కట్టుదిట్టంగా పనిచేస్తున్న వ్యక్తులుగాని, పార్టీలుగాని లేరని చెప్పవచ్చును. ఉన్నా సాయుధులైన కమ్యూనిస్టులముందు వీరు నిరాయుధులై నిలబడలేరు. అయినా వీరిసంఖ్య అత్యల్పం.

ఇందుమూలంగా ఇప్పుడు పల్లెల్లో భయం బాగా వ్యాపించింది. 'ఉన్న వారు' నగ నాణ్యంతో బస్తీలకు చేరుకొంటున్నారు. ఎప్పుడు దాడిజరుగుతుందో, దాడిజరిగితే లేని వారిఇళ్ళపై జరుగదుగదా, అందుకని ధనికులు ప్రాణ, ధనరక్షణకోసం గ్రామాలు విడిచిపెట్టిపోతున్నారు. 'లేనివారికి' గ్రామంలో జరుగుబాటే కష్టంగాఉంటే, బస్తీలకు పోయి



ఎలా జీవిస్తారు; కాబట్టి వాళ్ళు అడకత్తెరలోలా గ్రామాలలోనే ఉండిపోతున్నారు.

పల్లెలు ఇంత నిర్జీవంగా, భయాక్రాంతమయి ఉండడానికి కారణం ఏమిటి? పల్లెప్రజలలో చైతన్యం లేదా? ప్రజలను సంఘటనపరచి, అరాచకాన్ని నేలమట్టం చేయించే వ్యక్తులు లేరా? ఇలా ఆలోచిస్తే, నిజానికి దగ్గరకు వస్తాం.

పల్లెల్లో ఒక పెద్ద లోటు—చదువుకున్న వాళ్ళు పల్లెలను విడిచిపెట్టిపోవటం ఈనాటి గ్రామవాతావరణానికి ఈలోటు ముఖ్యకారణం. ఎక్కడ స్వతంత్రమైన ఆలోచనాశక్తి ఉండదో, అక్కడ జడత్వం, భయం వేర్లు పోసుకొని అరాచకానికాశ్రయంకోరుకుతుంది. అత్యాచారాలకు అడ్డు ఉండదు. కమ్యూనిస్టులు పల్లెల్లోలాగా బస్తీలలో దౌర్జన్యము ఎలా చేయులేరో, అలాగే పోలీసులూ పల్లెలలో చేసినట్టు బస్తీలలో అత్యాచారాలు చేయలేరు. ఎందుకంటే బస్తీలలో జనవాక్యానికి ఎక్కువశక్తి ఉంది.

గ్రామాలలో విద్యావంతు లెక్కువగా బ్రాహ్మణకులానికి చెందినవారు. సరస్వతికి లక్ష్మికి పొత్తులేదు: తర్వాత జస్టిస్‌పార్టీ సంప్రదాయాన్ని కాంగ్రెసుప్రభుత్వం, కాంగ్రెస్ సంస్థ చాటుమాటుగా, బహిరంగంగా అనుసరిస్తుండటం మూలంగా, వీరి జీవనసమస్యలు హెచ్చి, కష్టతరమైనయ్. జమీందారీల రద్దుతోపాటే గుడ్డిగా ఈనాందారీల రద్దుకూడా పూనుకోటంతో ఏకాగ్రజీవనాధారము ఉన్న పల్లెబ్రాహ్మణులు ఆకాస్త పోగొట్టుకొని, భుక్తికోసం బస్తీల నాశ్రయిస్తున్నారు. జీవనాధారం లేకుండా ఈ విద్యావంతులు గ్రామాలలో నిలిచిఉండటం అసాధ్యం. తరవాత చిన్నవయసువారికి పల్లెలలో విద్యావసతులు లేవు. అందుకని చదువుకు కొన్నికుటుంబాలు బస్తీలకు కదిలిపోతున్నయ్. చదువుకున్నాక ఎక్కడో ఉద్యోగమో సద్యోగమో. ఇలాగే ఇతరకులాలలోనూ విద్యావంతు లెవరైనా ఉన్నా, వారూ జీవికకోసం పల్లెలను విడిచిపెట్టుతున్నారు. ఇలాక్రమంగా పల్లెలలో విద్యావంతులసంఖ్య బాగా క్షీణించిపోతోంది.

ఆస్తిపాస్తులు హెచ్చుగానో, తగినంతగానో ఉన్న విద్యావంతులకుకూడా పల్లెలలో ఉండటం కష్టంగాఉంటోంది. బస్తీల్లోఉన్న వాక్స్వాతంత్ర్యం, ఆలోచనాస్వాతంత్ర్యం పల్లెలలో లేవు. గ్రామాధికార్లకు, వారికి సమానముగానూ, వారిని మించిఉండే స్థానిక పెద్దమనుష్యులకు, వ్యతిరేకంగా మాట్లాడటం ముఖ్యంగా ఈరోజులలో సాహసం. వీరినివిమర్శించావా కమ్యూనిస్టు అంటారు. కమ్యూనిస్టునామధేయం ఒకసారి పడితే, తర్వాత పర్యవసానం వేరే చెప్పనక్కరలేదు. అటుకమ్యూనిస్టులకు, ఇటువీళ్ళకుఉభయులకు అయిష్టుడవాలి. ఇది నిత్యప్రమాదం. కమ్యూనిస్టువేటలో ఊళ్ళోవాళ్ళు చేసే దౌర్భాగ్యపు పనులను హర్షించకపోతే, నీపేరు పోలీసుస్టేషనుకు తెలిసితీరుతుంది. ఇందుమూలంగాకూడా గ్రామాలలో ఇంకా మిగిలిఉన్న చదువుకున్నవారు కొద్దిమందీ నోరు మూసుకొని, గ్రామజీవితంతో సంబంధంలేకుండానైనా ఉండాలి. లేదా గ్రామాలు విడిచి

పెట్టాలి. ఏదిచేసినా గ్రామాభివృద్ధికి నష్టమే. ఇలాకాక కష్టాలను సహించి, అన్యాయాలను ప్రతిఘటింపగలిగే త్యాగసేవాశక్తులు ఇప్పటి వారిలో ఎక్కువగా కనబడట్లేదు. సారాంశం పల్లెల్లోంచి 'ఉన్నవాళ్ళు' చదువుకున్న వారు వెళ్ళిపోవలసివస్తోంది.

ఉదాహరణకు ఎక్కడైనా పోలీసు దాడి జరిగి అన్యాయం జరిగితే అక్కడి పేరు యెవ్వడైనా అది పత్రికలకు తెలియ జేసాడా, గ్రామాధికారి దగ్గరనుంచి పోలీసుఆఫీసర్ల దాకా వాడి అచూకీ తీసి వాడిపై పగబట్టా రన్నమాటే. ఇలాంటి, నవాతావరణంలో ప్రజల్లో స్వతంత్రమైన, సక్రమమైన ఆలోచనాశక్తి, కార్యదక్షత ఎలా సిద్ధించగలవు ?

సరిగా, సక్రమంగా ప్రజలకు రాజకీయ విషయాలను తెలియజేద్దాం అని రైతులకు కూలీలకు పత్రికలు తెప్పించి, ఏదో శిక్షణ ఆరంభిస్తే, అదిగో వాడు వీళ్ళను రెచ్చ గొట్టుతున్నాడు, వీడు కమ్యూనిస్టు అని ఊరి పెద్దలు గుడ్లెర్ర జేస్తారు. ఏదో విధంగా ప్రజలతో సంపర్కం కల్పించుకొని వారికి ప్రజాస్వామ్యం గురించి, రాజకీయ విషయాల గురించి సక్రమశిక్షణ ఇవ్వక పోతే, అటు కమ్యూనిస్టుగాలిదుమారాని కడ్డులేదు. ఆరంభిస్తే పూరిపెద్దలు ఉగ్రులవు తారు. ఈ వాతావరణంలో ప్రజలకు వికాసం ఎలా సిద్ధిస్తుంది?

కమ్యూనిస్టుల దౌర్జన్యం నెపంగా తీసుకొని గ్రామాల్లో ఏవిధమైన ప్రజా హితకార్యాన్నీ కొనసాగనీయట్లేదు. గ్రామాల్లోని పెద్దలు. పోలీసుల అండతో వీరు బీదరైతులను, కూలీలను నానావిధాలా భయపెట్టి పీడిస్తున్నారు. కమ్యూనిస్టులని చెప్పి, పొలాల్లోంచి రైతులను పోలీసు సహాయంతో వెళ్లగొట్టుతున్నారు. రైతు పది ఇరవయ్యేళ్లనుంచి చేస్తున్న భూమిని వదలుకోటమే కాక,, లారీదెబ్బలకు గురి అవుతున్నాడు.

కమ్యూనిస్టు అరాచకంసంగతి ఇలా ఉంటే, ప్రభుత్వపు ధాన్యసేకరణ విధానం కూడా అంతంతగానే ఉంటోంది. చీటికీ మాటికీ "ప్రొక్యూర్‌మెంటు ఆఫీసర్లు" రావటం ఇళ్లచుట్టూ, పురులచుట్టూ పోలీసులను పారాపెట్టటంతో ప్రజలు విసుగు చెందుతున్నారు. సక్రమంగా లెక్కల ప్రకారంతీసుకోవలసిన ధాన్యాన్ని ఒకసారి తీసుకపోవచ్చు. కాని అలా కాదు. మధ్యమధ్య వస్తూ తీసుకొన్న వారిదగ్గరే మళ్లీ మళ్లీ తీసుకపోతూ ఉంటారు. పెద్ద భూస్వాముల జోలికి వెళ్లరు. చిన్నవాళ్లను వేధిస్తారు. అధికార్లు ప్రజల గౌరవం ఇచ్చి పుచ్చుకోటం నేర్చుకోవాలి. ప్రతిదానికి పోలీసుజులుం చెలాయించాలను కొనే పూర్వ సంప్రదాయాన్నీ పూర్తిగా విడిచిపెట్టాలి,

గ్రామాల్లో శాంతిభద్రత లిలా ఉంటే, మిగతా విషయాలూ హీనంగానే ఉన్నయ్. విద్యావసతులు లేవు. వైద్య వసతులు లేవు. వానాకాలంలో, వేసవిలో రానూపోనూ ఎనిమిది పదిమైళ్లు దూరం ఉండే ఊరుకు పోయి, అక్కడ చదువు కోవాలి. చిన్నవాళ్లకి ప్రయాసవల్ల ఆరోగ్యానికి బాగా దెబ్బ; ఇంక ఎలాంటి జబ్బు వచ్చినా దేవుడి మీద, అమ్మవారిమీద భారం వేసి కూర్చోవాలి. పంచాయతీ బోర్డులున్న చోట్ల కూడా పరిస్థితులు ఏమీ బాగాలేవు. సంతకం చెయ్యటంమటుకు నేర్చుకొన్నవారు అధ్యక్షులు సభ్యులు అవు తుంటే, పరిస్థితు లింకెలా ఉంటయ్. ఇలా ఎన్ని లోపాలైనా చూపించవచ్చు.

ప్రభుత్వం ఇకనైనా మేల్కొని గ్రామ జీవితాన్ని పునరుద్ధరించాలి. గ్రామాల్లోంచి విద్యావంతులు బస్తీలకు వెళ్లిపోయే పరిస్థితులను నిర్మూలించాలి. పల్లెలో విద్యావంతులకు జీవనాధారం కల్పించాలి వారి ద్వారా ప్రజాజీవితం చైతన్యవంత మయ్యే వసతులు కల్పించాలి. పల్లెల ఆర్థికపరిస్థితి చక్కపరచాలి. సహకార ఉద్యమానికి మళ్లీ కొత్త ప్రాణం పోసి, తద్వారా ప్రజలను వ్యాపారుల పీడననుంచి, విడిపించాలి. ప్రతిగ్రామాన పాఠశాల నెలకొల్పాలి. బస్తీల్లో ప్రతిసందున డాక్టరుల బల్లలు కనబడతాయి. వీరిలో చాలామందికి "ప్రాక్టీసు" శూన్యం. వీరికి తగిన వేతనం ఇచ్చి, గ్రామాల్లో వైద్యవసతులు కల్పించాలి. అక్కడక్కడ ఉన్న ప్రభుత్వపు "ఆసుపత్రు"లను కూడా డాక్టర్లులేక మూసేస్తున్నారు. దీనికి కారణం ఆడాక్టర్లకు తగిన వేతనం ఇవ్వక పోవుటయే.

ఇంక ముఖ్యమైన ఆహారసమస్య. దిగుమతులు లేకుండా మనకు కావలసిన ఆహార ధాన్యాలను మనం పండించు కోవటం మన లక్ష్యం. ఈ ఉద్యమానికి పల్లెలే రంగాలూ కేంద్రాలూ. నగరాల్లో నాయకుల ప్రకటనలు తప్ప, గ్రామప్రజల్లోయీ వుద్యమస్పృహ గాని చైతన్యంగాని కనపడదు. గ్రామ ప్రజలు పూనుకోనిదే ఎన్ని ప్రకటనలిచ్చినా, ఎంతమంది అధికారులను నియమించినా, పంటలు పండవు. ప్రతి గ్రామంలో పార్టీప్రమేయం లేకుండా రైతుసంఘం ఏర్పఱచి, ఆధికాహారోత్పత్తి బాధ్యత ఆసంఘాన్ని నిర్వహించ మనాలి. నీటివసతులు, కాల్వలు, నూతులు, బంజరు భూమిని సాగుచేయటం ప్రజలు ఉత్సాహం కల్గిస్తే, వీటన్నిటిని స్థానికంగా లభించే కూలీలతోనూ స్వయంగాను కొనసాగించ గలరు. ఆఉత్సాహాన్ని ఇవ్వాళ ప్రభుత్వం కల్పించలేకపోతోంది.

గ్రామాల్లో భూవసతి లేనివారి జీవిక విషయం ప్రభుత్వం ఇంతవరకూ ఏమీ శ్రద్ధ చూపించలేదు. ఈనిరుద్యోగులకు చేతి నిండా పని కల్పించకపోతే, వీరు ప్రభుత్వానికే చేతి నిండా పని కల్పిస్తారు. చేతిపనులు వడ్రంగం, చేనేత, తాపీపని. ఖద్దరు, నీటి కాల్వలు తవ్వటం, రోడ్లు వేయటం వగైరా వసతులను ఏర్పరచకపోతే, ఈ నిరుద్యోగులని క్షుద్బాధసమస్య తీరేదెలా?

మంత్రులు పదే పదే సంచారాలు చేసి వస్తూ ఉంటారు. ప్రజలు ప్రభుత్వంతో సహకరించట్లేదంటారు. కాని యథార్థాన్ని గ్రహించలేకపోతున్నారు. ప్రజానీకానికో కొత్తసంకల్పం, ఆశకలిగి వారు. ఉత్సాహంతో కార్యరంగంలో ప్రవేశించటానికి దోహదపడే నిర్మాణవిధానాన్నీ దేన్నీ ప్రభుత్వం ఏర్పరచలేక పోతున్నది. 'ఇదిగో ఈ విధానం గ్రామప్రజ లందరకూ ఉపయోగిస్తుంది. దీనికి మీరు పూనుకోండి' అని ప్రభుత్వం ఉపారివ్వలేకపోతోంది. ప్రజల జీవితంలో కష్టాలు ఎక్కువవు తున్నవే గాని తగ్గట్లేదు. ఈప్రజను జాగృత పరచి, ఉత్సాహపరచ, తృప్తికలిగించే విధానాలను ప్రభుత్వం ఏర్పరచనంత కాలం, ప్రభుత్వం ప్రజల సహకారం పొంద లేదు. సహకారం ఇవ్వట్లేదనీ ప్రజలను అనీ లాభం లేదు. ఇటువంటి నిర్మాణ విధానం, గ్రామప్రజలజీవితానికి తక్షణం ఉపయోగపడే కార్యక్రమం ప్రభుత్వం ఎంత త్వరలో అమలు జరుప గలిగితే, అంత త్వరలో శాంతిభద్రతలు కూడా సుస్థిరం కాగలవు.

ప్రభుత్వం శాసనాలు చేస్తే చాలదు. ప్రజలకు ప్రత్యక్షంగా కనబడాలి. ప్రభుత్వం

(35 వ పేజీ చూడుడు)

ఏకాంకిక:

# "విడువలేని బురఖా"

రచన : క్లిఫర్డుబాక్సు ★ అనువాదం : శ్రీ నేమాని వీరభద్రరావు

ఉదయించనిశిశువు :—అయింది నాపనైంది. దారే కనపడడంలేదు. ఎలా వెళ్లను. యిలాగే తడుముకుంటూ ముందుకు వెళ్లటమా, లేక వెనక్కి తిరిగిపోవటమా. ఒక్క అంగుళం మేరైనా, ముందు కనపడ్డంలేదు. బహుశా నేను స్వర్గంనుంచి వస్తున్నాను కాబట్టి, ఆ దివ్యతేజస్సుముందు, యిది కారుచీకటిలా కనపడుతూందేమో! కొంచెం సేపు ఆగుతే యీ వాతావరణానికి నా కళ్లు అలవడతాయేమో! (అని కొంతసెపు ఆగుతుంది) ఆ (...నేను అనుకున్నట్లుగానే అయింది...యిది ఒకకొండలోయ...అవిగో స్వర్గశిఖరాలు. క్రింద ఒత్తుగా గడ్డి, పువ్వులు...అబ్బ ఎంత స్వల్పకాలంలో ఎంతమార్పు.. యింక మానవలోకం ఎంతో దూరం వుండదు...యిదివరకు నే నొకసారి వున్న ప్రదేశమే...నా జ్ఞాపకశక్తి ఎంత మందగిస్తూంది......కొంచెం జ్ఞాపకమొస్తూంది...చిక్కని అడవులు...నిర్మల ఆకాశం. ఎన్నిసార్లు చూసినా తనివితీరని, ఆ సముద్రంమీద సూర్యోదయ, సూర్యాస్తమయ దృశ్యాలు...మనుష్యులో.....ఎంత దయ......ఎంత తెలివి...అబ్బ.....ఎంత సుఖం...తిరిగి ఆ ప్రపంచంలోకి...యీ పర్యాయం...ఆడో...మొగో......అంతా బాగుంది...కాని యిప్పుడు ముందుకు సాగడానికి మార్గం...

దేవత: చేసినంతకాలం యింక ప్రయాణం సాగించనక్కరలేదులే. యింక ఒక్కరోజు ప్రయాణంలో వుంది మానవలోకం.

ఉ. శి : ఎవరా మాట్లాడుతూన్నది... దేవత కాబోలు :

దేవత : అవును...నేనే :

ఉ. శి : నేను సుఖపడే ప్రదేశానికి పోతున్నాను. యింతలో నువ్వు కనపడ్డావు. యీ సంతోషవార్త చెప్పడానికి అవకాశం చిక్కింది.

(యిద్దరూ ఒకరినొకరు ముద్దుపెట్టుకుంటారు.)

ఉ. శి : సోదరీ, నా కియ్యబడిన అజ్ఞప్రకారం భూలోకంలోకే పోతున్నాను. మార్గం ఏదో చెబుదూ.

దేవత : నీకు తిరిగి జీవించాలని వుందా? ఇక్కడ అనుభవించే సుఖం చాలలేదా నీకు?

ఉ. శి : స్వర్గం అంతా, నేను భరించలేనటువంటి సుఖంతోటి, ప్రేమతోను నిండిపోయిందని ఎరుగుదును. కాని ఆ భూలోకస్మృతులు ఒక్కొక్కసారి నన్ను కలవరపరుస్తూంటాయి...నేను అప్పుడప్పుడు వింటూంటాను......మానవులు యింకా భూలోకాన్ని స్వర్గంలా చెయ్యడంలో వెనుకబడ్డారని కాని నేనుమాత్రం, అక్కడా స్వర్గంలోవలె ప్రేమ, ఋజుప్రవర్తన వున్నాయని భావిస్తున్నాను...నా భావనే నిజమయితే, నాకు ముందుగా దారి చూపించి పుణ్యం కట్టుకో......కొందరు భూలోకంలో జన్మించబోతున్నారనగానే వణక నారంభిస్తారుగాని, నాకుమాత్రం ఆ భయం లేదు,

దేవత : చెల్లీ, యిదిగో యీ శిఖరాగ్రాన్నుంచి చూస్తే నీవు కోరేది కనిపిస్తుంది.

ఉ. శి : ఎక్కడ...ఎన్ని నక్షత్రాలు... లెఖ్ఖపెట్టలేకున్నాను...అదా భూమి...... ఏమిటి...పెద్దమంట లాస్తున్నట్లున్నాయే!

దేవత : నీ వెర్రిగాని...అది భూమా... సూర్యునికన్న వెయ్యిరెట్లు చిన్నది.. చూడు ఆ పాలపుంతవేపు చూడు.

ఉ. శి : ఓ...అక్కడా...నాకేమీ కనపడ్డం లేదు...అంతా చీకటే,

దేవత : బాగా పరికించి యింకోసారి చూడు.

ఉ. శి: ఏముంది...ఏదో మెరుస్తూన్న మార్గం కనబడుతూంది...అదేనా ప్రపంచం?

దేవత : అదా...మనుష్యుని కళ్లు కప్పే సూర్యలోకం.

ఉ. శి : ఆఁ...యిప్పుడు కనబడుతున్నాయి. దానిచుట్టూ ఏవో గుండ్రనివి తిరుగుతున్నాయి.

దేవత : చూడు...ఆమూడోది...కనిపించిందా?

ఉ. శి : ఆఁ.. కనిపించింది.

దేవత : అదే ప్రపంచం...నీ భావలో భూలోకం...ఎంత చిన్నదిగా వుందో చూడు. నీ తెలివితక్కువతనానికి విచారిస్తున్నాను. అక్కడ అందం లేకపోవడం సరిగదా, భరించలేనంత దుఃఖానికి గురికావాలి.

ఉ. శి : అయితే పుట్టడమనేది ఎలా వుంటుంది.

దేవత : జోకొట్టబడిన తరువాత వచ్చిన నిద్రలాగ, అడ్డడానికి వీలులేని, ప్రవాహంలాగ వుంటుంది. అందులో పూర్తిగా మునిగిన తరువాత, మెలకువ వచ్చినట్లుంటుంది. ఆ మెలకువే జీవితం. అందులోనే కోరికలు, కోరికల వెంటవిడుపు...యివి అక్కడి అనుభవాలు.

ఉ. శి : జీవితాంతంవరకు ప్రేమను, పంచిపెడుతూ వుంటానన్న కృతనిశ్చయంతో భూలోకంలోకి వెళ్ళనున్నాను.

దేవత : ప్రతీవారూ ముందు అట్టి నిశ్చయంతోనే...అట్టి సద్బుద్ధితో కొనసాగుతూ వుండాలని అనుకుంటారు......కాని... ఏమోలే...నీదగ్గర ఆ పట్టుదల...ఆ ధైర్యం వున్నాయేమో! కాని నీకు చెప్పక తప్పదు. చెప్పటం నావంతు, జన్మ అంటే ఒక బాధ్యతతో కూడిన కార్యకలాపం అనుకో.

ఉ. శి. నీకు పుణ్యం వుంటుంది... యింకోవిషయ మేదైనా మాట్లాడుదూ.

దేవత : నీ కొకటే తొందర...నాకూ ఒక పని తొందరగా నిర్వర్తించవలసి వుంది.

ఉ. శి : ఏమిటది?

దేవత : ఒక స్త్రీ యిప్పుడే చనిపోయింది. ఆమెకు మార్గం చూపెట్టాలి. శరీరాలు విడిచిపెట్టడానికే మనుష్యులందరూ చనిపోవటం అంటారు. యిక్కడినుంచి వెళ్లేటప్పుడు నీమాదిరిగానే దుస్తులు ధరిస్తారు. కాని రోజులు గడిచినకొద్దీ అందమైన ఒక బురఖాను సంపాదిస్తారు. అదే నిజాన్ని మరుగుపరుస్తుంది, పొగ, నిప్పును దాచినట్లు భూలోకంలో వున్నంతకాలం దాన్నే ధరిస్తారు. దాన్ని విడవడానికి కూడా ఎంతమాత్రం యిష్టపడరు...తిరిగి స్వర్గంలో అడుగుపెట్టేముందు ఆ బురఖాను విప్పమని ఆమెకు నేను యిప్పుడు బోధించాలి...ఆమెను నీమాదిరిగా మార్చాలి.

ఉ. శి : ఒక్కకోరికుంది నాకు...అది తీర్చాలి.

దేవత : ఏమిటది ?

ఉ. శి : భూలోకంలో వున్న ప్రేమ గురించి నేను మాట్లాడుటలో ఏమీ అతిశయోక్తి లేదని రుజువుపరచాలని వుంది. నీ పని నాకు ఒప్పగించు. ఆమెకు స్వేచ్ఛ నేను కలుగజేస్తాను :

దేవత : నువ్వేమో అనుకుంటున్నావు గాని, అది చాలా కష్టతమమైన పని.

ఉ. శి : ఏమిటీ...ఆ బురఖాను ఆమెచే నేను విసిరిపారేయించలేనా !

దేవత : సరే, నీకు అనుమతి యిచ్చాను. అదుగో చూడు...వస్తూందామె........ భూలోకంమీద ప్రేమ, ఆమెలో తొణికిసలాడుతూంది...నిద్దరోతూ నడుస్తూంది... అంతంలేని కలగంటూంది.

(ఎడమప్రక్కనుండి, విలువైన ముసుగు ధరించి, ఆ మానవకంకాళం, ఏదో గొణుక్కుంటూ ప్రవేశిస్తుంది.)

మానవకంకాళం : ఎంతమాత్రం వీలుపడదు. నన్ను విడవడానికి వీల్లేదు. తలనొప్పంతా పోయింది...జ్వరం మొదలే లేదు...నేను యింకా మృతశయ్యమీదున్నానని అనుకోను...ఏదో గుట్టమీదనుంచి మరియొక గుట్టమీదకు ఎక్కుతున్నట్లుగా వుంది. ఆగుదామన్నా, ఆగలేకపోతున్నాను.

(కూర్చుంటుంది)

దేవత వుదయించని శిశువుతో !

చూచావా యిలా దగ్గరకు రండి...

ఏదో చెప్దా మనుకుంటున్నాను, మీకు వినే ఓపికవుంటే నా చెల్లెలికి నేను కొంత సొమ్ము బాకీవున్నాను. అసొమ్ము జబ్బుతో వున్న నేను చెల్లించేదేమిటని భయపడుతూంది. ఆమెతో చెప్పండి నేను ఎంతమాత్రం చచ్చిపోను.

దేవత : ఈ జ్ఞాపకశక్తే క్రమంగా పల్చబడుతూంది సుమా.

మా. కం : అంతా కల...ఆరాళ్లు...ఆ సూర్యుడు...ఆ పువ్వులతో నిండిన లోయలు...అబ్బ...నేను ఋణవిముక్తుణ్ణవుతానని చెప్పండి. అబ్బ.. ఎంత నీరసంగా వుంది. నా ముసుగే నాకు బరువనిపిస్తూంది.

(లేచి నిలబడుతుంది)

దేవత (వుదయించని శిశువుతో) : వెళ్లు .. నడుస్తుందామె...ఆమె నావరించిన మాయను కరిగించు...ఆ ముసుగు వదిలేటట్లు చెయ్యి...ఊ త్వరగా...

ఉ. శి : (మానవకంకాళాన్ని సమీపించి)

చెల్లీ, నీకు సహాయం చెయ్యటానికి వచ్చాను.

మా. కం : ఏవిటి...నాకా...సహాయమా ఒకరి సహాయం ఎన్నటికి అపేక్షించను. పైగా గర్విస్తాను. యింతకూ నువ్వెవరు.

ఉ. శి : వుదయించని శిశువును ?

మా. కం : అలాంటి దెప్పుడూ కనీ వినీ ఎరుగనే !

ఉ. శి : పోనీ యిప్పుడు ఎదురుగా వున్నాను నమ్ము.

మా. కం : తీగెలు లేకుండా వీణ వుండనట్లు, శరీరం లేకుండా ఆత్మలుండవు. నీకు ఏదో వింతరూపం మాత్రం వుంది.

ఉ. శి : నేను తాల్చే యీ రూపమే అక్కడ శరీరంగా మారుతుంది.

మా. కం : అక్కడా......నీ వుద్దేశం భూలోకంలో నా.

ఉ. శి : నేను యీవేళ వెళ్లటం అక్కడికే.

మా. కం : నువ్వు చెప్పేదే నిజమైతే, అది నీకు అసంభవం...అయితే నామాటో.

ఉ. శి : నీ శరీరం యిప్పుడే మృతినొందింది.

మా. కం : నే నా....చనిపోవడమా... మనుష్యుల కెంత జ్ఞానంలేకుండా పోయింది వాళ్లే యింతకాలమూ దెయ్యాలూ, దేవతలూ, కథల్లోపడి యీదటంలేదూ !

ఉ. శి : అలాగా...ఎంత ఆశ్చర్యం. యింకా ఆ ప్రపంచం గురించి వూహించలేకుండా వున్నానులే.

మా. కం : ఈ గుట్టలే నా ఏవిటి, స్వర్గం ?

ఉ. శి : అయ్యో, యింకా స్వర్గం చాలా దూరం వుంది. నాకు భోగపడిందేమిటంటే యీ రెండింటిని కలిపేది యీ దేవతేమోనని.

మా. కం : అయితే యీ రాత్రే స్వర్గానికి పోవాలి.

ఉ. శి : భూలోకంనుండి యిక్కడికి వచ్చినట్లే, యిక్కణ్ణుంచిపోయి, యింకో జన్మ ఎత్తుదామని వుందా ?

మా. కం : అలాగ ఎందుకు కోరుకోకూడదు ?

ఉ. శి : భూలోకంలో, ఎన్ని శక్తులన్నా సదుపయోగపడతాయి. యిక్కడ మాత్రం అవన్నీ, రసంలేని ద్రాక్షపళ్ల మాదిరిగానే పరిణమిస్తాయి.

మా. కం : నేనే చచ్చిపోతే, నా ధనం నా కీర్తి...యీస్వర్గంలోనా...నా చదువు నాపట్టుదల...బతివూకై వూరుకుంటాయి. స్వర్గంలోప్రవేశించినంతమాత్రాన, నేను చేసే దేముంది.

ఉ. శి : నీబురఖా ముందు ఒదిలెయ్.

మా. కం : యిదా...ఒదలటమా...నాజీవితకాలమంతా, దీనికోసం వెచ్చించాను. పోగు పోగూ కూడదీసి దీన్ని దిట్టంగా వుంచాను. ప్రపంచంలో యింత చక్కనివి బహుకొద్దిగా వుంటాయి. నాశరీరంతో సరిపోయేది. ఎక్కడా లేదు.

ఉ. శి : దానిమీద నీకు ఎంత మమకారంవున్నా, అది వదిత్తేగాని, నీకు స్వర్గంలో అడుగుపెట్టడానికి అర్హతలేదు.

మా. కం : నీమాటలు నమ్మలేకుండా వున్నాను. ఇది లేకపోతే నేను, నేనే కాదు.

ఉ. శి : అది ఒక దుస్తువంటిదే.

మా. కం : ఎన్నటికీ గాదు...యింకా ఏదో విలువుంది అందులో నాజీవితమంతా దీనిమూలంగానే మధురంగా వుంది. అదే వదిత్తే, యింక నన్ను గుర్తించేదవరు ? సూర్యుని జ్వాలల్లో ఒక జ్వాలలాగు, లక్షోపలక్షుల మానవుల్లో ఒక అనామకునిగా వుండిపోతాను. నీజీవితాశకూడా యిలాగేవుంటే అసలు ఆశ వుంచుకోకపోవటమే మంచిది.

ఉ. శి : నీభావం నాకర్థం కావటం లేదు.

మా. కం : భూలోకంలో నీతోటివారిచే గుర్తింపబడాలంటే మంచి దుస్తులు ధరిం

చాలి. అలా చెయ్యకపోతే, ప్రతీవాడూ నిన్ను దగ్గరకు చేరనియ్యడు.

ఉ. శి: మనుష్యులు ఒకరికొకరు సహాయం చేసుకుంటారా?

మా. కం: ఇంత అమాయకంగా వున్నావు...నీకు మట్టుకు ప్రపంచం భరించరానిదైపోతుంది...నేను ముందుగానే చెప్తున్నాను. మనుష్యులందరూ నిన్నొక వెర్రివానిగా చేస్తారు.

ఉ. శి: ఎంత ఆశ్చర్యం, ప్రతిచోటా గాలివున్నట్లు ప్రతిచోటూ ప్రేమతో నిండి వుండదా? మనుష్యులకు ప్రేమకూ సంబంధమే లేదా?

మా. కం: ప్రేమన్నది ఒక నక్షత్రం వంటిది. ఒకసారి మెరపులా మెరిసి మాయమౌతుంది.

ఉ. శి: మనుష్యులందరూ యుద్ధాలు చేస్తున్నారా?

మా. కం: చెయ్యకేం, చిన్న రాజ్యం కోసం; చిన్న మెత్తు బంగారంకోసం; యుద్ధాలు చెయ్యకేం, చేస్తునే ఉన్నారు.

ఉ. శి: యింకానా! అయితే శాంతి సమయంలోనో?

మా. కం: ప్రతివాడూ తన స్వలాభం కోసం యుద్ధంచేస్తున్నాడు.

ఉ. శి: ఒక స్నేహితునిపై మరియొక స్నేహితుడా! అయితే ప్రపంచానికి పురోగమనం?

మా. కం: పురోగమనమా...మనుష్యుల వల్లకాదు. అదృష్టం, అవకాశం, వీటివల్ల అయితే అవాలి.

ఉ. శి: మనుష్యులు న్యాయంగాను, యగాను వుంటారా?

మా. కం: ఎందు కుండాలి? ఏనాటి నా మట్టిలో కలిసేవాళ్లకి.

ఉ. శి: మానవు లనిపించుకొనేవాళ్లకు క్రై ఆలోచన లుండవు.

మా. కం: ఏమైనా అను...మనుష్యులందరూ జీవితాన్నంతనూ వృధాచేస్తారు.

ఉ. శి: అదే నిజమైతే, భూలోకనివాసం భయంకరమే.

మా. కం: నీవు యిక్కడ ప్రవర్తించినంత హాయకంగా వున్నావంటే, కేవలం ప్రేమతోనే అందరి హృదయాలూ నిండివున్నాయని నీవు భావిస్తే, క్రమంగా, మనుష్యుల్లో కృత్రిములు, హృదయహీనులకు బానిసవైపోతావు. ఇతరుల అజ్ఞలను నీవు శిరసావహించాలి. లేదా నీయిచ్ఛ ఒకరిమీద రుద్దాలి. కాని మొట్టమొదటే దయాదాక్షిణ్యాలు వదలి, యితరుల సౌకర్యం, క్షేమం చూడకుండా, నా కాయుష్షు, నా కారోగ్యం, అని బయలుదేరేవంటే చిక్కులు చాలా వున్నాయి. ఈ ప్రపంచంలో బ్రతుకు ఒక ఆటగా భావించేవంటే, సుముఖంగా గడిచిపోతుంది.

ఉ. శి: మానవునిలో "దయ" అన్నది ప్రవేశపెడదామని, నా నిశ్చయం.

మా. కం: దయ, అమాయకత్వం, కేవలం పని చెయ్యవు.

ఉ. శి అందుకేనా, నీవీ బురఖా ధరించేవు.

మా. కం: ఇప్పుడు, దీని విలువ నీ కర్థమౌతూన్నదన్న మాట. కాని యింతకూ నేను ఏమార్గం పట్టాలి.

ఉ. శి: ఈ ముసుగు వదిలేదాకా నీవు యిక్కడినుంచి కదలడానికే వీలులేదు.

మా. కం: ఇదా నీ జ్ఞానోదయం. యిది నీవు తప్పించుకోవాలని ప్రయత్నిస్తున్నావా? మంచి వుపాయమే ఆలోచించావే. నీవు ఎంతకీ చెప్పకపోతే, నా మార్గం నేనే చూసుకుంటాను.

(కుడివైపుకు రాబోతుందిగాని, దేవత మార్గాన్ని అడ్డుకుంది.)

దేవత: ఎక్కడికి కెళతావు?

మా. కం: నాకు స్వర్గం కావాలి.

దేవత: "నేను" అన్న గర్వం దూరంగా విసిరేస్తేగాని, నీకు ప్రవేశమే లేదు.

మా. కం: అయితే స్వర్గంలోమాత్రం, మా ఆకారాలు..............

దేవత: అవన్నీ మానవలోకంలో కలల్లోని రూపాలు.

మా. కం: మరి తెలివితేటల మాట?

దేవత: తెలివితేటలు స్వర్గంలో నే హెచ్చు. మానవలోకంలో ఒక్కనికీ అట్టి తెలివుండదు.

మా. కం: ఎలాగ?

దేవత: మేము ఒక వస్తువును ప్రేమించేమంటే, ఆ సంగతి మేము పూర్తిగా గ్రహించి, కొసవరకూ నిలబెట్టుకుంటాం.

మా. కం: నా బురఖా...నేనే ఆ బురఖాని...నీవేమో కాదంటావు వదలమంటావు.

దేవత: వదలటానికి సాహసించు.

మా. కం: ఎంతమాత్రం వదల్లేను.

దేవత: అయితే వుండు...విసిగివేసారిన తరువాత, కాలమే నీకు బుద్ధి గరుపుతుంది.

మా. కం: ఇక్కడ ఎంతమాత్రం నిలవలేను నేను.

దేవత: ముసుగు ముందుగా పారేయ్.

మా. కం: నాకు భయం, కోరిక సమానపాళ్లలో వున్నాయి...ఎంత భయంకరకరమైనా వదిలేస్తాను.

(బురఖాతీసి పారేస్తుంది)

అబ్బ...యిప్పటికి స్వేచ్ఛ లభించింది. సంతోషంఅంటే యిప్పు డర్థమయింది. యింతకాలమయింతరువాతగదా స్వస్థలం చేరుకున్నాను.

దేవత: (వెనుదిరిగి వుదయించని శిశువుతో) చెల్లీ యిక శెలవు (దేవత, మానవ కంకాళం ముందుకు సాగుతారు. వుదయించని శిశువుమాత్రం, వారి పోకడ చూస్తూవుంటుంది. వారు దృష్టిపథాన్నుండి మళ్లినతరువాత, బురఖామీద దృష్టిపడుతుంది.)

ఉ. శి: నా మార్గం బహుకంటకం. మృతకళేబరమే, నా అమాయకత్వాన్ని చూసి హేళనచేసింది. మనుష్యులందరూ ఆటవస్తువుగాచేసి, ఆడిస్తారేమో! అయినా, యీ బురఖా నేను తీసుకోవాలి. కాని వారందరికన్నా, బలంగాను ధైర్యంగాను వుండాలి.

(బురఖాలో దూరుతుంది)

—— ——

# అమెరికాలో గృహపరిశ్రమ





## పింగాణీ పరిశ్రమ

ఎంత యాంత్రికదేశంలోనైనా చేతి పరిశ్రమలలో తయారైన వస్తువుకున్న ప్రాధాన్యం, యంత్రంలో తయ
మాదిరి వస్తువుకు లేదు. ఏవస్తువుకావస్తువు సజీవమైనట్టు, వ్యక్తిత్వమున్నట్టు, ఒక జాతి సంస్కృతికి మానుష
నిలిచినట్లు అనిపించగల్గుతుంది, చేతితో, కళాకారుని కౌశలంలో తయారైన ప్రతి విడివస్తువూకూడ

అమెరికాలో పింగాణీ వస్తువులు గృహపరిశ్రమగా తయారైన మచ్చులు ఇవి.







# బ్రిటిష్ ప్లాస్టిక్ పరిశ్రమ





ప్లాస్టిక్‌తో తయారుచేసిన గృహపరికరాలు.



ప్లాస్టిక్ నుంచి కృత్రిమపు పట్టు తయారీకి
పనికి వచ్చే సన్నని దారాలు
తయారు చేస్తున్నారు.



ప్లాస్టిక్ టెలిఫోన్ యంత్రం.





ప్లాస్టిక్‌తో తయారుచేసిన బల్లలూ కుర్చీలూ.

సినిమా లేఖ :

# షాహుకారు చిత్రం



**అయ్యా,**

**1936** నుండి తెలుగుఫిలిములు నేను చూడలేదనే మాట నాకొక పెద్ద డిస్క్వాలిఫికేషన్ అని నేను ఒప్పుకొనక తప్పదు. అయినా ఆ కాలంలో తెలుగుఫిలిముపరిశ్రమ చాల ప్రిమిటివ్ దశలో నుండినదానివల్ల యడవల్లి నటించిన శాకుంతలం బాబకొపంటి ఫిలిములు చూడకుండ ఉండిండి నాకొక విధమయిన గొప్ప క్వాలిఫికేషన్ అని నేను సమర్థించుకొంటూ నాలో నేనుండేవాణ్ణి. స్నేహితులు ఎంత బలవంతంచేసినా ఎన్ని కాంప్లిమెంటరీలు తెచ్చినా పోయేవాడనుకాను. ఇంగ్లీషు ఫిక్చర్సుకు తరువాత హిందీవి, ఆ తర్వాత తెలుగువి బాగుంటాయని ఒకానొక ఫిలిము ఘానుమిత్రుడు సిద్ధాంతంచేసినది విని యుంటిని. అప్పుడూ ఇంగ్లీషుఫిక్చర్లను చూచినానే కాని ఒకసారి కూడా వేరే తెలుగు ఫిక్చర్సు చూడలేదు. కొంచెం చనవు తీసికొనే స్నేహితులు మాత్రం నీవు ఆ కాలంలో ఇంత పనిచేసి ఈ పరిశ్రమకు ఇంతో అంతో కాంట్రిబ్యూటు చేసి ఇట్లా చేపస్తం పెట్టుకొనేది భావ్యం కాదంటూ నొచ్చుకుంటూ మందలించేవారు.

మొన్న ఒలాత్కరించి విజయావారి "షాహుకారు" ఫిలిమును చూడవలెనని ఒక మిత్రుడు బరబర ఈడ్చుకొనిపోయినాడు. 14 ఏండ్లయిన తర్వాత పేరుమాసిన దర్శకుల చేతిలో నీ పరిఘృపరిశ్రమ చూడదగినంత పెంపు పొందియుండు ననుకొన్నాను కాని ఇంత ఆశాభంగం కలుగుతుందని ఎదురు చూడలేదు. దగ్గరదగ్గర 16 వేలడుగుల ఫిక్చరు క్లోరోఫారం లేకుండా అన్ని గంటల ఆపరేషన్ పొందినట్లుండింది. మొదటినుండి కొంచెం సైశిత్యంతోనే చూచినాను. వస్తువు, అల్లిక, పోకడ, పెంపకం, శైలి, పడగ, కూర్పుతీర్పులు—జీవం బాగా పల్చింది. ప్రతివ్యక్తి తన పోర్షన్ బాగా చేసినట్లు చెప్పవలసిందే. అయితే కంప్లెయింటేమన్నా? అదే చెప్పడానికి మాటలు తడువుకొంటున్నా. పెద్ద టెక్నికల్ సైడు చెప్తా. చోట్లలో ఎడిటరు సింక్రనైజింగు పట్లలో శ్రద్ధతప్పినాడు. శబ్దం లాంగ్ షాటప్పటికీ షార్టు షాట్లప్పటికీ ఏమాత్రం తేడా లేకుండ పలుసార్లున్నవి. రాత్రికీ పగలుకూ భేదం కనపడకుండా ఇండోర్ షూటింగులో అమాంతంగా అడ్డువస్తుండే నీడల్తో లైటింగ్ పాడుచేసికున్నది.

అనవసరంగా హరికథలు పొడిగించి ఆ సన్నివేశాలకే మూడోవంతు ప్రాతినిధ్యమిచ్చి ప్రధానకథకు భంగంకలిగింది. గుడ్డితాతయ్యవల్ల కథకు వచ్చినలాభం లేకున్నా పరవాలేదు.

హ్యూమర్ (వల్గర్ హ్యూమర్) కోసమని ఆ పిశాచపుపాత్రలను ప్రవేశపెట్టింధానివల్ల చక్కని మానుషప్రతిబింబసమయాన్ని అధోగతి పట్టించింది. అంతకంటే వేరేవిధంగా కథానాయకుణ్ణి జెయిలుకు పంపించియుండవచ్చును. చాకలిరామివలన కథకు కలిగిన లాభం, హాస్యరసం పెంపొందించడానికి దానికే ఒకవిధంగా గ్రామీణ సంఘటన కలిగించియుండే కథలోని జానపదప్రాధాన్యానికి విశేషంగా లాభించియుండేది. స్వాభావికంగానూ ఉండేది. సున్నంరంగడే దాన్లోకి ఎంతో పనికివచ్చియుండేవాడు. అంతంత పెద్దశరీరభాగాలను నాయకుడు చూడకుండానే చాలసేపు భోగందాన్ని మగవాడనుకుంటూ ఉండడం విసుగెత్తుతుంది చూచేవాళ్లకి. కథలోతునకు భంగంకలిగించే సన్నివేశాలు తలచుకుంటే ఈ ఘట్టం గుండెలకు పోటు కలిగిస్తున్నది. సరి, ఇంక సంగీతమా! చెప్పవలసిందే లేదు. అనాంధ్రము, అజాతీయము అగు ఇమిటేషన్‌పాటలుగాని వాని పాడడానికి పూనకొన్న మూడోతరం గాయకులూ జుగుప్స పుట్టిస్తున్నవి. జానపదగీతాలను కొల్లగొట్టుకొంతగిన సమయాల్లో కడాతరం హిందూస్తానీభాణీల సంగీతం డోకుల్లు పుట్టించింది. దర్శకుడు లావైపు తమ దృష్టి తలంపులు ప్రవేశపెట్టకుండింది తమ ప్రజ్ఞలకు కళంకమని చెప్పుచన్నాను. చాకలపిల్లకూడా హిందీవట్లతోనే పాడుతుంది. తుమ్మెదపాటల్లాంటివి పెట్టియుంటే ఎంతో ముద్దుగానూ స్వాభావికంగానూ ఉండేది.

సేట్టింగులపట్ల లోకల్ కలరుకు భంగం లేదు అనీ కాలనిజ మనడానికి తావులేదు. అయినా కొంచెం జాగ్రత్త కలిగియుంటే సీలో మాజిస్ట్రేటుకోర్టులు నిర్మానుష్యంగానూ అంటే పక్కిళ్లు గడబిడలయినా లేకుండాను ఉండదు.

16 వేలడుగులు పూర్తిచేస్తేనేగాని ఫిలిం బాగుండదనుకొని డైరెక్టర్లు పనికిమాలిన పాట్లు చొప్పించియున్నారు. 'ఏరో' స్వంత గొప్పఫిలిము ఏడువేలడుగుల్లో ముగిసిందంటే ఈ చెత్తపాట్లల్లో నాలుగకే డః అవార్డు వస్తాయా! ఈ పిక్చర్సు పనిమాలి పాత్రలకు పనికిమాలిన ప్రాధాన్యం ఇవ్వలని డైరెక్టర్లు అనుకోకుంటే 7 నెల పూర్తిచేసి పాశ్చాత్యఫిలిములతో పయుండవచ్చును. ఉన్నకత అంతే. మంగా తెచ్చిపెట్టుకోలు షూటింగుల సినవారికి ఈ విపరీతపు వెలల కాల ఇంత దురాచారం చేస్తున్నారే అః స్సంకటం కలుగుతుంది. ఈ 16 వేల రెండు పిక్చర్లు వచ్చియుండునే! ఆ కాలం నేను మాయాబజారుకు కొత్తకొత్త ఆమెచూర్లను ప్రవేశపెట్టించినానని నల్భై వేలలో 14 వే లడుగుల ఫిలిం చేసినాననీ నవ్వినారు. నేడు కూడా నా 'కృష్ణలీలలు' 'మాయాబజారు' గ్రామాల్లో డబ్బులాగుతున్నాయంటే నేటి ఇంప్రూవుడు పద్ధతుల్లో మెషినరీతో ఎజుకేటయిన ఆడియన్సులతో ఈఫిలిము ఆక్షన్ 'టెంపో' లేక గంతకట్టిన గానిగెద్దులాగా కాళ్లీడ్చుకుంటూ వెళ్లు

(24 వ పేజీ చూడుడు)

మాతృవిజ్ఞానం:

# ఆట మాట

ఆయిదోమాసంలో పాప దొర్లడం ఆరంభిస్తాడు. కొందరికి ఆలస్యం పట్టుతుంది. బొద్దుగాఉండేవాళ్లకి ఆలస్యం కావడం సామాన్యం. బక్కపలచగా చలాకీగాఉంటే పిల్లలు ముందే ఆగడం ఆరంభిస్తారు. పాప దొర్లడం నేర్చుకున్నాడంటే అమ్మ వెయ్యికళ్లతో కనిపెట్టుకు చూడాలిసిందే. ఒకసారి దొర్లడం నేర్చిన ల్లలు ఇంక పడుకోపెట్టినచోట నిలకడగా ండరు. చూస్తూచూస్తూండగా క్షణంలో ంచం చివరకెళ్లి ఉంటారు. పాము గా బరువైన బుర్రెత్తి నూటిగా డ్డానికి ప్రయత్నిస్తూ కొంటినవ్వు వ్వతారు. అయితే వాళ్ల బుర్రలు మహా కిందపడి బొప్పికట్టినప్పుడు ఏ పది లో నెప్పికి కొంత భయంవల్ల కొంత ్తారు. ఆతరవాత ఏమీ ఎరగనట్లు లుగా ఆడుకుంటారు. సాగే బుర్ర ట్టి బుర్ర బద్దలౌతుందని భయపడ ్లేదు.

ఏడు తొమ్మిది మాసాల మధ్య సాధన కూచోడం నేర్చుకుంటారు. కొందరు కొందరు ఏడాదికి కాని కూచోలేరు. అంత మాత్రానికి ఏదో పెద్దలోపం ఉందని భయపడనవసరంలేదు. కూచునేముందు సాధించడం చూడవలసిందే. రెండుచేతులూ పట్టుకోగానే ఉతలతో లేవాలని ప్రయత్నిస్తారు. అప్పుడే చాలాసేపు కూచోబెట్టకూడదు. స్వయంగా కూచోగలిగేటంతవరకూ చేతులు పట్టుకుని ఆట్టేసేపు కూచోబెడితే మరీ లేత వెన్నెముక ఉంటే పిల్లలకి ఉత్తరోత్తరా గూనిరావచ్చును.

చొక్కా తొడుగుతోంటే పాపకి తగిన చీదరింపు విపరీతమైన కోపం వొస్తుంది. కదలకుండా ఉండమని తల్లి గదుముతుంది. గదిమినకొద్దీ తిక్క ఎక్కువౌతుంది. అసలు కుదురుగా ఉండడమనేది పాప నైజంలోనే లేదు. అందువల్ల కబుర్లు చెప్తూనో ఆడిస్తూనో కదులుతున్నప్పటికీ ఆట్టే బాధపెట్టకుండా చొక్కా తొడగడం తల్లి నేర్చుకోవాలి. లేకపోతే కమ్యూనిస్టులాగా తిరగబడతాడు.

ఆరోమాసం దాటగానే పాకడం ఆరంభిస్తారు. కొందరు అట్టే పాకరు. కూచోడం నేర్చుకుని కొన్నాళ్లైనతరవాత నడక నేర్చుకుంటారు. పాకేవాళ్లు అనేకరకాలు. కొందరు పాకేఫక్కీ మారుస్తుంటారు. చాలామంది ముందుకే పాకుతారు. కొందరు వెనక్కి పాకుతారు. కొందరు పెడకి పాకుతారు. కొందరు మోకాళ్లమీదా చేతులమీదా పాకుతారు. కొందరు పాదాలమీదా చేతులమీదా పాకుతారు. కొందరు ఒక మోకాలుమీ దానుకుని రెండో కాలి పాదంతో నెట్టుకుంటూ పాకుతారు.

ఏడాదిదాటకముందే సామాన్యంగా నిలబడ్డం చేతనౌతుంది. కొందరు ఎనిమిదోమాసంలోనే నిలబడతారు. కొందరికి ఆలస్యంగా అలవాటవుతుంది. కొందరు నిలబడతారు కాని తరవాత కూచోడం ఎల్లాగో నేర్చుకోడానికి చాలరోజులు పట్టుతుంది. నిలబడ్డం నేర్చినతరువాత మెల్లిగా తల్లిని పట్టుకునీ, అడుగు లేస్తారు. ఒకొక్కప్పుడు నిలబడి అసహాయశూరుడుగా అడుగు లేస్తాడు. స్వయంగా అడుగులు వెయ్యగానే పాపకి ఏదో మహత్కార్యం సాధించినంతగా ఆనందం కలుగుతుంది.

నడక నేర్చేవయస్సులో పాప మనస్సులో పెద్దపెద్ద మార్పులుకూడా వస్తాయి. అప్పుడే వాంఛ అనే వాసన అంటుతుంది. వాడికి అప్పుడే తన శరీరం బలువు తెలిసివస్తుంది. నడకనేది నిజానికి నేర్పనక్కరలేదు.



ప్రధానామాత్యుడు పండిట్ నెహ్రూ అమెరికా బాలబాలికలకు కానుకగా పంపిన 'అశోక' 'శాంతి' అనే ఏనుగుగున్నలను ఏప్రిల్ 16 న అమెరికాలో భారత రాయబారి శ్రీమతి విజయలక్ష్మి పండిట్ వాషింగ్టన్‌లోని నేషనల్ జూలాజికల్ పార్కుకు వప్పచెప్పారు. ఆ సందర్భపు ఫొటో ఇది.

కాళ్లలో తగినసత్తువ చేరగానే, వాడి కాళ్లే ఊరుకోనివ్వవు. నడవమని ప్రేరేపిస్తాయి.

ఇవన్నీ నేర్చుకునేటప్పుడు ఆటవస్తువులనేకవిధాల ఉపయోగపడతాయి. కాని అవిలేకయియినంత మాత్రాన ఆలస్యంగా అలవాట్లు వస్తాయని కాదు. ఏవీ లేకపోయినా అన్నీ స్వయంగా నేర్చుకుంటారు. కాని ఆటవస్తువులుంటే బిడ్డకి ఆహ్లాదం కలుగుతుంది.

ఏడాదివెళ్లే ప్రాంతంలో పాప తన స్వంత భాషని సృష్టించుకుంటాడు. ఆకలైతే ఒకవిధంగా బడబడలాడతాడు. ఏడుపులో బడబడ సులువుగా కలిసిపోతుంది. ఆటవస్తువులూ పటాలూ మనుషులు కనిపిస్తే తన లేతభావాల్ని ప్రకటించడానికి మరొకరీతిని పలుకుతాడు. మనకివన్నీ వింతధ్వనులుగా ఉంటాయి. కాని అలవాటైన తల్లి ఈ భావని సులువుగా అర్థంచేసుకుంటుంది.

చురుకుపాలెక్కువుండే పిల్లలు ముందే చిలకపలుకు లారంభిస్తారు. కొందరు తాపీగా చుట్టూ మనుషుల్నీ, వాళ్లమాటల్నీ విని పరిశీలించి అప్పుడు (ఆలస్యంగా) మొదలెడతారు.

మాట నేర్వడంలో చుట్టూ ఉండే మనుషుల నడవడి ప్రధానంగా పనిచేస్తుంది. పాపని చూసేపద్ధతిపైనకూడా చాలా ఆధారపడి ఉంటుంది. సంరక్షించే తల్లి ఎప్పుడూ పాపను పలకరించకుండా మౌనంగా ఉంటే పాపలో ఉత్సాహం కొరవడుతుంది. పెరిగి పెద్దవాడైనప్పుడు గంభీర ప్రకృతీ, స్వార్థమూ అలవడతాయి. తల్లి నిత్యం దండిస్తూ ఉండేదయితే పాపకి చికాకు, కోపం, క్రొత్తవాళ్లని చూసినప్పుడు తప్పించుకుని తిరగడం మొదలైనవి అలవాటవుతాయి. ఎందులోనూ అతి పనికిరాదు. ప్రతివానికీ కొద్దుంది. పెద్దవాడైతే తల్లితో వాదిస్తాడు. తగువులాడతాడు. లేదా వీధిలోకి పోతాడు. పాప అలా చెయ్యలేదు. తల్లినిరాదరణని సహిస్తూ సన్నిధిలోనే ఉండాలి. పెద్దలే కాదు పిన్నలు కూడా, నోరులేని పసిపాపలు కూడా ఎప్పుడూ కోరేది వాత్సల్యంతో ఆదరించేవాళ్ల సన్నిధిలో ఉండాలనే. ఇవి లభించనినాడు పెద్దలైతే ఇంటినుంచి తప్పుకోగలుగుతారు. పాప అర్థం తెలియని క్లేశంతో లోలోన కుమిలిపోతాడు.

మాటలు నేర్చే సమయంలో అతిసామాన్యంగా అందరూచేసే పొరపాటొకటుంది. ముద్దుకోసం తల్లీ అన్నలూ అక్కలూ పాపతో ముద్దు (ముద్ద) మాటల్లోనే మాట్లాడ్డం. అప్పుడే పాపకి అకస్మాత్తుగా వాగ్ధరిలభిస్తే తన నవమానం చేస్తున్నారని వాళ్లని తిట్టిపోసేవాడే. మా.టలు నేర్చి, క్రొత్త విద్యని మాటిమాటికీ ప్రయోగించే కుతూహలంతో పాప మొదలు పెద్దల ముద్దు మాటలకి ఉప్పొంగిపోవచ్చును. కాని క్రమేణా ముద్దుమాటలంటే అసహ్యంపుట్టి, అలవాటైన మాటలు మాని క్రొత్తమాటలు మాట్లాడ్డానికి ప్రయత్నిస్తాడు. కొందరు కొందరికిమాత్రం మాటనేర్పుకి మురిసిపోయి ముద్దుమాటల్నే పట్టుకు వేలాడతారు. మంచిమాటలు చేతనైకూడా ముద్దుమాటలు మాట్లాడే పిల్లల్ని చూస్తే పరాయివాళ్లకి మొద్దులెట్ట బుద్ధి పుడుతుంది.

మాటలు ఆలస్యంగా అలవడితే బెంగ పెట్టుకో నక్కర్లేదు. ఆలస్యం కావడానికి అనేక కారణా లుండవచ్చును. కనీసం మూడేళ్ళకైనా మాటలు అలవాటై తీరతాయి.

ఆదిలో అంతా వ్యాకరణం తప్పినవాళ్లే. కాని క్రమంగా దారిలో పడతారు. కొందరు కొందరికి కొన్నికొన్ని మాటలు ఎంత ఈడొచ్చినా పలకడానికి ఇబ్బంది పడతారు. కొందరు 'ర' కి బదులు లకారమో యకారమో ప్రయోగిస్తారు. ఇది నాలుక సరిగ్గా తిరక్కపోవడంవల్ల సంభవిస్తుంది. కొందరు పెద్దవాళ్లైనప్పటికీ అల్లాగే మాట్లాడుతారు. చిన్నప్పుడే సరిగ్గా నేర్పడానికి ప్రయత్నిస్తే సులువుగా సాధ్యమౌతుంది. అంటే దీనికోసం దండించకూడదు. స్నేహంగా చెప్పి నేర్పాలి. దండిస్తే ఫలితాలు విపరీతంగా కూడా ఉండచ్చు.

[డా॥ బెంజామిన్ స్పాక్ వ్రాసిన గ్రంథం ఆధారం.]

---

# షాహుకారు చిత్రం

(22 వ-పేజీ తరువాయి)

తున్నదంటే ఏమాత్రం మన ఫిలిములు వృద్ధిపొందిందని చెప్పుకోడానికి అవకాశమే లేదు.

పటంచూస్తుంటేంతవఱకూ అందులోని హ్యూమన్ ఎలిమెంటూ (టచ్) ఆడియన్సులోనివాళ్లను కన్నీరుకార్చునట్లు చేస్తుంది. వచనమూ, వాక్యాలూ, వాగ్వాదాలూ మంచి జీవంతో పటుత్వంతో ఉన్నాయి. కానీ అంతమెల్లగా పోనిరించిందానివల్ల అయ్యోపాపం పేరిన తేనెతునకలు దుమ్ములో పడిపోవుచున్నట్లు జాలివేస్తుంది. రచించిన దాని ఫలితం, దానివచించే వారిలో ఉంటుంది అథరుకు. నటకుల నని లాభమేముంది? నడిపించేవాడు సాగనీక పోతే! మధ్య మధ్య కామెరావారి ప్రతిభ లైప్సుల్లో ఉంటుంది. ఎన్నో లైప్సుల కథలోని కంటిన్యూయిటీలను కన్నులకు కంటగించేటట్లు గబగబ ఉడుదుడుకుగా చూపించినాయి.

ఇవన్నీ జ్ఞాపకంతెచ్చుకోవాలం వీలులేదు పటం చూస్తూను, ఆ తర్వాత మొత్తంపై మంచిజానపదపం బంధగ చక్కని నటకుల మూలంగా ఎంతో ఉండవలసింది పైలోపాలవల్ల పాడనా ఈ 14 ఏండ్ల వెనకడుగువల్ల నష్టం లేదు కాని ఆంధ్రుల ఫిలిం ప అభివృద్ధినంద లేదనే దుఃఖిస్తున్నా. గొంగడి వేసినచోటే ఉంది!

వేల్పిక్చర్సువారు సీతాకల్యాణం పు చేసినాక కృష్ణలీలలు తీసికొన్నాం. అప్పట్లో రచన సాయానికని ప్రవేశించినాను. మాయాబజారు పూర్తిగా కల్పన, కథ, రచన, సంగీతమూ-కడపటిరోజుల్లో దాసుగారి మరణానంతరం - దర్శకత్వమూ చేసి ఆరోగ్యభంగభయంచేత అప్పటికి ఫిలిముల నుండి విరమించుకొన్నాను. నేటికి నాటక రచనాలు వేషాలూ వేస్తూనే ఉన్నాను—

—శ్రీ కుమారదేవం

---




# జోవియన్ గర్వభంగం

(జెస్టా రోమెనారం నుండి)

శ్రీ నేరళ్ల లక్ష్మణరావు

పూర్వం జోవియన్ అనే రాజు వుండేవాడు. అతడు మహాగర్వి, ధనమదాంధుడు. భగవంతుని గూడా లక్ష్యపెట్టనివాడు. అతని పాలనలో ప్రజలు అష్టకష్టపాలగుచుండెడివారు. మనసులో యెంత అసహ్యించుకొనినా రాజుకిమాత్రము అధికారమునకు లోబడి వుండేడివారు.

ఒకరోజు వుదయం పదిగంటలవుతుంది. రాజు పటాలాన్ని పరీక్ష చెయ్యటానికి వచ్చాడు. పరీక్ష పూర్తిఅయిన తరువాత 'ఇవ్వాళ మనం వేటకి వెళ్లాలి' అని శాసించాడు.



"చిత్తం... మరి భోజనం చేసి బయల్దేరడం మంచిది..." అన్నాడొక వృద్ధయోధుడు.

"నాకు తెలుసు... ప్రతివాడు నాకు సలహా యిచ్చేవాడే!" అంటూ రాజు పళ్లుకొరికాడు.

ఎవ్వరూ మరి మారు మాట్లాడలేకపోయారు.

సన్నాహాలు అతిత్వరగా జరిగాయి. రాజు వేటకి బయల్దేరాడు.

వేటలో చాల అలసిపోయాడు. ఆ అలసటలో వేటసంగతి మరచి వెతకి వెతకి ఒక కోనేరుదగ్గరికి స్నానానికి వెళ్ళాడు.

రక్షకబటునితో తన దుస్తులను గుఱ్ఱమును జాగ్రత్తగా చూడమని చెప్పి తాను నీటిలోకి దిగాడు. రాజు స్నానం చేస్తూవుండగా సర్వవిధాలా రాజునే పోలివున్న ఒక అపరిచితుడు అక్కడికి వచ్చి, రాజుదుస్తులను తాను ధరించి గుఱ్ఱముమీద రాజభవనమును చేరుకున్నాడు.

జోవియన్ స్నానం చేసి బయటికి వచ్చేసరికి అక్కడ తనగుఱ్ఱం దుస్తులు లేవు. ఆశ్చర్యంతో ఆ ప్రదేశమంతా గాలించాడు. అసలు అవి అక్కడ వుంటేగా అవపడటానికి.

"దుదృష్టవంతుడ్ని...యిప్పుడేం చెయ్యను!" అని విలపించాడు.

అల్లా కొంతసేపు ఆలోచించగా అతనికి, ఆ పరిసరాల్లో తా నెరిగిన ఒక యోధుడున్నాడని, తానతనివద్దకు వెళ్లి యాదార్థం తెలుసుకొనవచ్చునని, తట్టింది.

వెంటనే తానా యోధుడింటికి వెళ్ళి తలుపు తట్టాడు. ఆ యోధునివద్ద నున్న పరిచారకుడు

వచ్చి తలుపు తీయకుండానే, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"తలుపు తియ్యి!... తెలుస్తుంది. నేనెవరో?" అని గర్జించాడు, జోవియన్.

పరిచారకుడు తలుపు తీశాడు. అతనికి చాలా ఆశ్చర్యం వేసింది. 'ఎవరయ్యా నువ్వు చాలా ఘాటుగా మాట్లాడుతున్నావే?" అన్నాడు.

"నేనా... జో...వి...య...న్, మీ దేశానికి చక్రవర్తిని, త్వరగా వెళ్ళి మీ అయ్యగారికి నే నొచ్చానని చెప్పు," అని సగర్వంగా సమాధానం యిచ్చాడు.

"ఛీ! మూర్ఖుడా! యిప్పుడే, జోవియన్‌చక్రవర్తిగారిని మా అయ్యగారు రాజభవనం దాకా సాగనంపి వచ్చారు. కాని, నువ్వు రాజుగారిపేరు పెట్టుకొన్న మూర్ఖుడవు గనుక నిన్ను తప్పక మా అయ్యగారిదగ్గరకి తీసుకు వెళ్తాను," అంటూ ఆ పరిచారకుడు జోవియన్‌ను లోపలకు తీసుకువెళ్ళి తన అధికారితో వాడి చరిత్రను చెప్పాడు.

"ఎవరయ్యా నువ్వు? రాజుగారి పేరు పెట్టుకొన్నట్లు గాని వారికి తెలిస్తే నీశరీరం నీదగ్గర వుండదు... తెలిసిందా? ఇకనైనా బుద్ధి తెచ్చుకొని పో... లేకపోతే..." అన్నాడా యోధుడు కాస్త గట్టిగా.

"ఏమిటీ! నన్నెవరని అడిగేటంత పొగరొచ్చిందా నీకు? మొన్ననే కదూ నీకు పెద్ద వుద్యోగమిచ్చింది! అప్పుడే చేకసి మేలంతా మరచిపోయావా? తృణఘ్నుడా...!" అని గర్జించాడు జోవియన్.

"ఆ! అప్పుడే వ్యవహారం చాలావరకూ వచ్చింది, యింకూరుకుంటే లాభం లేదు. మితిమీరి పోతున్నావు. దారిలో పోయే భిక్షుకాడికికూడా యింత కండకావరమా? నన్నే బెదరిస్తున్నావా? చూడు నిన్నేం చేయిస్తానో..." అంటూ ఆ యోధుడు తన పరిచారకులని పిలిచి, "వీడిని యీడ్చుకుపోయి తాటిచెట్టుకు కట్టి చావమోదండి..." అన్నాడు.

పరిచారకులు ప్రభువాజ్ఞానుసారంగా నిర్వర్తించారు. జోవియన్ కంటనీళ్లు పెడుతూ, "నా అన్నం తిని నా అండని పెరిగే యీ తుచ్ఛులు నన్నే అవమానిస్తారా? వీళ్ళ సంగతి చూస్తా," నని శపథం చేస్తూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

వెంటనే అతనికి మరో మిత్రుడు గుర్తొచ్చాడు. అతనివద్దకు వెళ్ళితే తనకార్యం అవుతుందని వూహించి అక్కడికి వెళ్ళి తలుపు తట్టాడు. వెంటనే వొక పరిచారకుడు వచ్చి, "మీ రెవరు?" అని అడిగాడు.

"నేను మీ చక్రవర్తిని, దురదృష్టవశాత్తు నా గుఱ్ఱం, దుస్తులు అదృశ్య మయ్యాయి. మీ ప్రభువు వద్దనుంచి సహాయం కోరి వచ్చేను," అని సమాధానం యిచ్చాడు.

ఆ మాటలకి పరిచారకుడు ఆశ్చర్యచకితుడై తనప్రభువుతో యీ సంగతిని చెప్పాడు.

"లోపలికి తీసుకురా..." అని ఆ యోధుడు ఆజ్ఞాపించాడు. కాని జోవియన్‌ను చూచి తనరాజుగా పోల్చిపట్టలేదు. అనుమానంతో మళ్ళా. 'ఎవరు నువ్వు?' అని అడిగి 'నేను మీ రాజు జోవియన్‌ని,' అన్న సమాధానాన్నే పొందాడు.

ఆ సమాధానంతో అతడు పక్కుమని నవ్వి 'పిచ్చికుంకవు కాకపోతే, యిప్పుడే నేను రాజుని రాజభవనంలో విడిచిపెట్టి వచ్చాను. నువ్వు మూర్ఖుడవైనా, దొంగవైనా యిప్పుడే రెండిటికి మందు యిస్తానంటూ తనసేవకులతో, "వీడిని తీసికెళ్ళి యింత రొట్టెనీళ్లు యివ్వండి" అన్నాడు.

ఆజ్ఞాపించడమే ఆలస్యంగా జోవియన్‌ని వాళ్లు హూనాంచేసి చీకటికొట్లో తోసేసారు. తనకి జరిగిన యీ రెండోపరాభవంతో జోవియన్‌కి నిజంగా గర్వభంగం జరిగింది.

అల్లా జోవియన్ విచారగ్రస్తుడై వుండగా అతనికొక ఆలోచన తట్టింది. తక్షణమే తనభవనానికి వెళ్ళి రాణిని చూడా లనుకున్నాడు. ఆమె తననితప్పక గుర్తుపడుతుందన్న వుద్దేశ్యంతో యెల్లాగో అక్కడనుంచి తప్పించుకొని రాజభవనం చేరుకొన్నాడు.

అక్కడ వున్న పరిచారకుడు మొదట్లో వొప్పుకోకపోయినా జోవియన్ చాలా దీనంగా బ్రతిమాలడంమూలంగా చివరికి రాణి వద్దకు వెళ్ళి అతనికి రాజుదుస్తులు రహస్యంగా తేవటానికి, రాణిగారితో అతను చెప్పిన గుర్తును చెప్పటానికి వొప్పుకున్నాడు.

సేవకుడు రహస్యంగా రాణిగారి దగ్గరకు వెళ్ళి జోవియన్ చెప్ప

# వికృతదాంపత్యం

(ఆంగ్లంనుండి అనుకరణ)

## శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం

అనగనగా ఒక ఊళ్లో ఒక వైశ్యు డున్నాడు. అతనికి ముగ్గురు కుమార్తెలు. ఒకనాడా వైశ్యుడు, దూరదేశాలకు వ్యాపారంనిమిత్తం వెళ్లవలసివచ్చింది. అందువల్ల అతడు తన ముగ్గురు కూతుళ్లను పిలిచి వాళ్లకు ఏమేమి బహుమానాలు కావాలో కోరుకోవలసిందని అడిగాడు. ఇద్దరు కూతుళ్లు అమూల్యమైన రత్నమణి హారాలు కోరారు. కాని ముద్దులకూతురు సుందరి అపూర్వమైన తెల్లగులాబి పూవు తెచ్చిపెట్టమని కోరింది. ...గవంతుడైన ఆ ...పారి, తనఇద్దరు ...తుళ్లు కోరిన ...మణిహారాలు ...యాసంగా ...చేయగలడు. ...ని ముద్దుల ...ముద్దు చెల్లించటం చాల ...న కాని సాధ్యపడదు.

...కె, పరదేశాల్లో, తన ...ర్తిచేసుకొన్నాడు. ...ండ, ఇరువురు ..., అమూల్యమైన హారాలను ఎంతో డబ్బు వెచ్చించి కొన్నాడు. అనంతరం తన చిన్న కూతురు కోరిన గులాబీపుష్పమును వెతుకసాగాడు. ఎన్ని వనాలు వెతికినా తనకు కావలసినది లభించలేదు. చిట్టచివరకు అతడొక పురాతనరాజభవనానికి వచ్చాడు. ద్వారపాలకుడు, ఆ వ్యాపారిని లోనికి తీసుకువెళ్లాడు. అతని కోసమేనా అన్నట్లు అక్కడ, భక్ష్య భోజ్యాలు బాగా ఏర్పాటు చేయబడి ఉన్నాయి. అతడు వానిని భుజించి ప్రక్కనున్న ఉద్యాన వనంలోకి వెళ్లాడు. ఆ తోటలో తనకూతురు వర్ణించి చెప్పిపంపిన గులాబిపూవులాంటిదే కనిపిం... అతని మనస్సుకు సంతో... కలిగింది. వెంటనే ఆ... కోశాడు.

ఆతడా పూవును కో...గానే భయంకరగర్జ...లతో సింహం అతని ముందు ... "ఎవరు నువ్వు? ఎందుకీ... కోశావో నిజం చెప్పు? ...ప్రాణాలు నీకు దక్కవు" అని ...దా సింహం భయంకరంగా... మా వ్యాపారికి ముచ్చె... పోశాయి. ఒళ్లు కంపించింది గద్గదస్వరంతో "ఓ మృగర... నొక వ్యాపారిని. నాకు ... కుమార్తెలు. నా ముద్దు... సుందరి, ఒక అపూర్వమైన గులాబిపుష్పం కావాలని కో... నేను ఎన్ని వనాలు వెతి... అలాంటిపుష్పాన్ని చూడ...పోయాను. అట్టి పుష్పా... సుందర ఉ...వనంలో ఆమె కో... కోశాను." స...మా... చెప్పాడు.

"నిజం కాబట్టి ...రాను. ఇం... ఈరోజు... నీ కుమా...రికి బహూ... కానీ నీకు దారిలో ఏది కనిపిస్తే దాన్ని నాకు వాగ్దానం చేయి. నీమాట ద... కో. నీకు నెలరోజులవ...నిచ్చాను" అని పల్కి సింహం ...జున్ని వదలి పెట్టింది.



విషయాలన్నీ చెప్పాడు. ంనే రాణి రాజుగారిని పిలిపించి, దేం దారుణం మహారాజా!— లో భిక్షుగాడికి మనగుట్టు యెల్లా ిశాయి? అంటూ రాణి రాజు ర విలపించింది.

ఆ ప్రక్క నున్న మాయ ఈ యిదంతా విని, "ఆ భిక్షుకు యిల్లా తీసుకురండి," అని తన వారకులకి ఆజ్ఞాపించాడు.

వెంటనే వాళ్లు జోవియన్‌ను పలిక్కి తీసుకువెళ్ళారు. చాల ంనుంచీ జోవియన్ చేతుల్లో న వేటకుక్క, అకస్మాత్తుగా ఎమీాదకు వురికింది. వెంటనే భటులు జోవియన్‌ని రక్షిం

భిక్షుకుణ్ణి చూచి రాణీ లోప వెళ్ళిపోయింది.

వక్రవర్తిహోదాలో నున్న షు జోవియన్‌ను, 'ఎవరు వ్వ? ఏం, కావాలి నీకు? అని శ్నించాడు.

"మీా ప్రశ్నలు చాలా వింతగా న్నయి. నేను యీా దేశానికి వర్తిని, నా పేరు జోవియన్. రించి నేనే చెప్పుకొనవలసి దుస్థితిపట్టింది," అన్నాడు యన్ అతిదీనంగా.

వెంటనే ఆ మాయరాజు తన ముద్దేశించి, "మా యిరువురిలో, రా జెవరో నిజంగా చెప్పండి? ర్ణయాన్ని పాటిస్తాను." ను

భువులు అతి స్వల్ప విష అడిగారు. ఈ పాడుభిక్షు మాకు ప్రభువు... కాదు... మా చిన్ననాటినుండి మి మ్మెరుగుదుము. మీారే మా ప్రభువులు, మా సర్వస్వము." అని సభవారు సమాధానం యిచ్చారు.

మాయరాజు రాణివైపు తిరిగి 'నిజం చెప్పు నీకు పీ డెవరో తెలుసా? 'చక్రవర్తిని, నీకు భర్తను,' అంటున్నాడు, అన్నాడు.

"ప్రభూ! తమరు నన్నావిధంగా ప్రశ్నించడం ధర్మమా? మన యిరువురి దాంపత్యం నిన్న మొన్న టిది కాదు. ముప్పదిసంవత్సర ములు పెరిగిన మహావృక్షము. ఇంతకంటె వేరు చెప్పలేను." అంది.

"మరి వీడికి మనగుట్టు యెల్లా తెలిసింది?"

"అదే నాకూ అనుమానంగా వుంది ప్రభూ"

ఆ మాయరాజు యింక ఆ విష యాన్ని స్మరణచేయకుండా జోవి యన్ నుద్దేశించి, "నువ్వు నా పద విని స్వీకరించటానికి చేసిన ప్రయ త్నానికి శిక్షగా నిన్ను గుఱ్ఱాలచేత యీడ్పించవలసినదిగా ఆజ్ఞాపిస్తు న్నాను; మారు మాట్లాడితే మరణ దండనే," అన్న ఆ మాయ రాజుమాటలకి జోవియన్ నిలు వునా నీరయిపోయాడు.

వెంటనే రాజు సేవకులను పిలిచి "వీడికి కొనప్రాణం వుంచండి,"అని చెప్పాడు.

సేవకులు జోవియన్‌ని కొన ప్రాణంతో వదిలారు. అమితమైన బాధలో పట్టరాని దుఃఖం వచ్చింది. "ఎందుకీ పాడు బ్రతుకు, నా మిత్రులు, నా భార్య, నన్ను నమ్ముకొని పనిచేసిన సేవకులు అంతా నాకు విషమయాన్ను. ఈ పాడుబ్రతుకు బ్రతికేకంటె మర ణమే ఉత్తమం; అని నిరాశచెందిన జోవియను కొక ఆశా కిరణం సోకింది. కొంత ధైర్యం వచ్చింది. కొంత బలం, ఉత్సాహం వచ్చింది. ఆరిపోతూవున్న జ్యోతికి మళ్ళా చమురు పోసినట్లయింది. సరే... 'ఆరారుమారు ప్రయత్నం చేస్తాను. ఇదీ ఫలించకపోతే యిక మర ణమే శరణ' మని నిశ్చయించు కొని జోవియన్ మెల్లగా తన పురో హితునియిల్లు చేరుకున్నాడు. తలు పుదగ్గర పడివున్న జోవియన్‌ను పురోహితుడు లోపలికి తీసుకువెళ్ళి అతనికి శీతలోపచారాలు చేశాడు. కొంతసేపటికి జోవియన్‌కి స్పృహ వచ్చింది.

'ఎవరు నాయనా... నువ్వు? ఇల్లా అలసిపోయి వున్నా వెందుకు? ఆ.. వీపు మీాద యీా చీరిక

(35-వ పేజీ చూడుడు)